మన

# రైతువాణి

వ్యవసాయ మాసపత్రిక

మే : 2022

## ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం

## 22వ రాష్ట్ర మహాసభలు

2022 మే 28, 29, 30

అనంతపురం

జయప్రదం చేయండి

## మేడే శుభాకాంక్షలు



8 మంది రైతుల

ఆత్మహత్య ...13వ పేజీలో

# రైతు సంఘ వ్యవస్థాపక (1936 ఏప్రిల్ 11) దినోత్సవ పతాకావిష్కరణలు



కొత్తపల్లి మండలం సింగ రాజుపల్లె



నందికొట్కూరు మండలం కొడిదెల



పాములపాడు



ఆత్మకూరు మండలం కొత్తరామాపురం




అనకాపల్లి జిల్లా అచ్యుతాపురం



అనంతపురం జిల్లా బుక్కరాయసముద్రం



దాచేపల్లి మండలం పెదగార్లపల్లె



నంద్యాల మండలం చాబాడు

మన
# రైతువాణి
మే - 2022
సంపుటి : 32 సంచిక : 5
వెల : రూ. 25 పేజీలు : 52
సంవత్సర చందా : రూ. 250/-



మన రైతువాణి
3/4బి, వడ్డేశ్వరం బైపాస్, వడ్డేశ్వరం (పోస్ట్)
తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా
పిన్ : 522 502
E-mail : rytuvani@gmail.com

చెక్కులు, డి.డి లు Mana Rytu vani
పేరుతో పంపాలి.
SBI Ac No : 52024133051
IFSC : SBIN0020343

## విషయసూచిక

| | |
|---|---|
| రైతాంగ పోరాటాలకు వేదిక కాబోతున్న అనంతపురం | 6 |
| వ్యవసాయ సంక్షోభ పరిష్కారానికి మార్గం ఐక్య పోరాటాలే | 9 |
| సహకార చక్కెర కర్మాగారాలను పునఃప్రారంభించాలి | 10 |
| కౌలు రైతుల చట్టాన్ని సవరించకుండా రాయితీలు అసాధ్యం | 11 |
| ఐదుగురు కౌలు రైతుల ఆత్మహత్య | 13 |
| అడ్రస్ లేని అగ్రి మిషన్ | 14 |
| ఆహార భద్రతకు ముప్పు | 15 |
| భారత వ్యవసాయ రంగ పరిణామ క్రమం -4 | 17 |
| పత్తి రైతులను కాపాడండి ! : కేంద్రానికి ఎఐకెఎస్ డిమాండ్ | 19 |
| సంస్కరణల విద్యుత్తు 'ఛార్జీలు' | 20 |
| సంక్షోభంలో చెరకు సాగు | 21 |
| ఖరీఫ్‌కు విభజన చిక్కులు | 22 |
| కేరళలో నేను చూసిన వ్యవసాయం | 23 |
| జుకిని తోటల పెంపకం | 25 |
| వేసవి కూరగాయల సాగులో సమస్యలు - నివారణ | 28 |
| టమాటలో విత్తనోత్పత్తి | 30 |
| వేసవి దుక్కులతో ఎంతో మేలు | 33 |
| ఆయిల్‌పామ్ - సస్యరక్షణ చర్యలు | 34 |
| వ్యవసాయంలో భూసార పరీక్ష దాని ఆవశ్యకత | 35 |
| పచ్చిరొట్ట భూసారానికి రక్ష | 37 |
| మామిడిలో పండు ఈగ బెడద - నివారణా మార్గాలు | 39 |
| సేంద్రియ జీవన ఎరువుల వాడకం - ఉపయోగాలు | 41 |
| బంతి సాగుతో లాభాల బాట.. | 43 |
| కష్టంతోనే విజయం | 45 |
| కదలిక | 47 |
| కరెంటు షాక్‌కు ఇవ్వాలి దిమ్మదిరాగే షాక్ (పాట) | 49 |
| శ్రమవాక్యం, ఒక ఎండా కాలపు దాహం (కవితలు) | 50 |


మీరు పకోడాలను ఎందుకు పెంచరు?


అమ్మ క్యాంటీన్
దాదాపు ఇక్కడ
త్వరలో రాబోతోంది
మోడీ గ్రీన్ టీ
SATISH ACHARYA

# గీతోపదేశాలు


అచ్చే దిన్ పకోడా
ఛాయ్ ఉచితం సాబ్
SIFY.COM
SATISH ACHARYA


పన్ను కాదు బాపూ... ఇది 'వికాస్ మార్చ్' కోసం
SATISH ACHARYA


మీరు నిరుద్యోగులు అని నిరూపించడానికి తగినంత డేటా ఇక్కడ లేదు భాయ్
SATISH ACHARYA

## సంపాదకీయం...  శ్రామిక జనావళికి రైతువాణి మేడే జేజేలు

కార్మికవర్గ దీక్షాదినం మేడే. కార్మికవర్గ త్యాగాలకూ, పోరాటాలకూ చిహ్నం మేడే. శ్రామికుల జీవితాల్లో పెనుమార్పులకు శ్రీకారం చుట్టిన దీక్షాదినం మేడే. పారిశ్రామిక విప్లవం తరువాత అమెరికా, యూరప్‌లలో భారీ పరిశ్రమలను స్థాపించి, కార్మికులతో రోజుకు 18 నుంచి 20 గంటల వరకూ గొడ్డు చాకిరీ చేయించుకునేవారు. గాలి, వెలుతురు, కనీస సౌకర్యాలు లేకుండా రోజు మొత్తం బండ చాకిరిని చేయించుకోవడానికి నిరసనగా అమెరికా దేశంలోని చికాగో హే మార్కెట్‌లో జరిగిన కార్మికుల ప్రదర్శనే ఈ మేడే పుట్టుకకు బీజం వేసింది. తొలిసారిగా 1884లో రోజుకు 8 గంటల పని మాత్రమే ఉండాలని కార్మికులు ఆందోళన ప్రారంభించారు. ఈ ఆందోళన 1986 నాటికి తారాస్థాయికి చేరింది. 1986 మే 1న 40 వేల మంది కార్మికులు సమ్మె మొదలు పెడితే మే 3 నాటికి ఆ సంఖ్య లక్షకు చేరుకుంది. ఉధృతమైన సమ్మెపైకి యాజమాన్యాలు పోలీసులను ఉసిగొల్పాయి. ఆ రోజు కాల్పుల్లో ఇద్దరు బలయ్యారు. ఆ మరురోజు కూడా పోలీసులు కాల్పులు జరిపారు. ఈసారి 8 మంది మరణించి 40 మందికి పైగా గాయపడ్డారు. ఆ తర్వాత కొన్ని రోజులకు గాయపడిన వారిలో మరో ఏడుగురు అమరవీరులయ్యారు. పైగా ఈ కాల్పులకు కారకులు కార్మిక నాయకులే అంటూ పార్సన్స్, స్పైస్, ఎంగెల్, ఫిషర్ అనే కార్మిక నాయకులకు ఉరిశిక్ష వేశారు.ఆ సంఘటనల అనంతరం 1890 వరకూ అనేక దేశాల్లో కార్మికోద్యమాలూ, నిరసన ప్రదర్శనలూ చోటుచేసుకున్నాయి. 1890 మే 1న బ్రిటన్‌లోని హైడ్ పార్కులో చేపట్టిన కార్మిక ప్రదర్శనకు 3 లక్షల మంది కార్మికులు హాజరయ్యారు. చికాగోలో జరిగిన కార్మికుల బలిదానానికి గుర్తుగా అప్పట్నించి మే 1న కార్మిక దినోత్సవంగా జరుపుకుంటున్నారు.

నిరుడు మేడే నాటికి దేశం వ్యవసాయ రంగాన్ని గంపగుత్తగా కార్పొరేట్ శక్తులకు అప్పగించడానికి తెచ్చిన నల్ల చట్టాల రద్దు కోసం రైతు ఉద్యమం ఓవైపూ... నాలుగు కార్మిక కోడ్‌లు రద్దు కోసం కార్మికుల పోరాటం మరోవైపూ... దేశవ్యాప్తంగా సాగుతున్నాయి. క్విట్ ఇండియా ఉద్యమ దినమైన ఆగస్టు 9న దేశవ్యాప్తంగా కార్మిక, కర్షక ఐక్యత వెల్లివిరిసింది. ఏడాదిపాటు సాగిన రైతు ఉద్యమం ముందు బిజెపి కేంద్రం ప్రభుత్వం తలవంచక తప్పలేదు. మూడు వ్యవసాయ నల్ల చట్టాల రద్దు రైతాంగం సాధించిన చిరస్మరణీయమైన విజయం.

దుష్ట చట్టాలు రద్దయినా రైతాంగం కోరుతున్న మద్దతు ధరల గ్యారంటీ చట్టం, రైతు రుణ విమోచన చట్టం సాధించవలసి ఉంది. రైతు పోరాటానికి విరామమే తప్ప మరొక పోరాటానికి సిద్ధమవుతామని రైతు పోరాట నాయకత్వం ఆనాడే విస్పష్టం చేసింది. రైతు ఉద్యమానికి తలవొంచి నల్ల చట్టాలు రద్దు చేసిన ప్రభుత్వం.. తిరిగి ఆ విధానాల వైపే తమ ప్రయాణమని సంకేతాలిస్తోంది. మోనిటైజేషన్ పైపులైన్ పేరుతో దేశ సంపద యావత్తూ కార్పొరేట్ శక్తులకు కట్టబెట్టే చర్యలు చేపడుతూనే ఉంది. అందుకే ట్రేడ్ యూనియన్లన్నీ మార్చి 28, 29 తేదీల్లో దేశవ్యాప్తిత పిలుపునివ్వగా.. అవే రోజుల్లో సంయుక్త కిసాన్ మోర్చా గ్రామీణ హర్తాళ్‌కు పిలుపిచ్చింది. 'ప్రజలను కాపాడండి, దేశాన్ని కాపాడండి' అని నినదించాయి.

మేడే సందర్భంగా ఈ నినాదాన్ని ముందుకు తీసుకువెళ్లాల్సి ఉంది. నాలుగు కార్మిక కోడ్లు రద్దు కోసం, పంటల మద్దతు ధరల గ్యారంటీ చట్టం సాధించడం కోసం, ప్రయివేటీకరణ విధానాలను వెనక్కి కొట్టడం కోసం పోరాటాలను ఉధృతం చేయాల్సి ఉంది. ఈ పోరాటాలను కార్మిక, కర్షక ఐక్యతతో సాగించాల్సి ఉంది. అన్ని స్థాయిల్లో కార్మిక, కర్షక ఐక్యతను పెంపొందించాల్సి ఉంది. సకల శ్రామికులందరికీ మేడే శుభాకాంక్షలు!

# రైతాంగ పోరాటాలకు వేదిక కాబోతున్న అనంతపురం

• మే 28, 29, 30 తేదీల్లో మహాసభలు • 28న ప్రదర్శన, బహిరంగ సభ
• పాల్గొనున్న అఖిల భారత, రాష్ట్ర నాయకత్వం • ప్రతినిధులుగా 500 మంది రైతు నేతల రాక

ఆంధ్రప్రదేశ్ రైతుసంఘం 22వ మహాసభలు మే 28, 29, 30 తేదీల్లో అనంతపురంలో జరుగుతున్నాయి. రాష్ట్రంలో రైతాంగ ఉద్యమాలు, పోరాటాలు నిర్వహిస్తున్న 500 మంది ప్రతినిధులు అనంతపురం మహాసభల్లో పాల్గొనున్నారు. ఇప్పటికే మహాసభ గురించి ప్రజలకు తెలియజేసేందుకు అనంతపురం జిల్లాలోని ఏడు నియోజకవర్గాల్లోగల 31 మండలాల్లో గోడ రాతలు పూర్తి చేశారు. మహాసభను జయప్రదం చేసేందుకు ఈ అన్ని మండలాల్లోనూ రైతు సదస్సులు నిర్వహించారు. ఈ కృషిలో ఇతర ప్రజాసంఘాల నాయకులు, ప్రతినిధులు కూడా తోడ్పడ్డారు. సుమారు 200 మంది రైతు, వ్యవసాయ కార్మిక, సిఐటియు సంఘాల నేతలు, కార్యకర్తలు ఈ మహాసభలను విజయవంతం చేసేందుకు విశేష కృషి చేస్తున్నారు. మహాసభల ముందు మే 8న అనంతపురంలో "వ్యవసాయ సంక్షోభం - రైతాంగ ఉద్యమాల ఆవశ్యకత" అంశంపై పెద్ద సదస్సును నిర్వహిస్తున్నారు. ఈ సదస్సుకు అఖిల భారత కిసాన్ సభ అధ్యక్షులు అశోక్‌ధావలే ముఖ్య అతిథిగా హాజరై ప్రసంగించనున్నారు. అలాగే మే 26 నుంచి 28వ తేదీ వరకూ వ్యవసాయ రంగంలో వచ్చిన మార్పులు, రైతు ఉద్యమాలపై ఫోటో ఎగ్జిబిషన్ జరుగుతుంది. దీనికి ముందు మే 24 నుంచి 26వ తేదీ వరకూ వ్యవసాయ రంగ సమస్యలపై విద్యార్థులకు డ్రాయింగు పోటీలు నిర్వహిస్తున్నారు. అలాగే 26, 27 తేదీల్లో గ్రామీణ వ్యవసాయ ఆటల పోటీలు కూడా అనంతపురం జిల్లాలో నిర్వహించనున్నారు.




మహాసభలు జరిగే ప్రతినిధుల హాలుకు తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట యోధురాలు మల్లు స్వరాజ్యం పేరుతో, రాయలసీమ రైతాంగ ఉద్యమ నేత టి.నరసింహయ్య పేరుతో ప్రాంగణ ద్వారాలు ఏర్పాటు చేయనున్నారు. అనంతపురం ఆర్ట్స్ కళాశాల మైదానంలో జరిగే బహిరంగ సభ ప్రదేశాన్ని ఢిల్లీ రైతాంగ అమరవీరుల ప్రాగణంగా వ్యవహరిస్తారు. మే 28 ఉదయం బహిరంగ సభ జరుగుతుంది. దానికి ముందు వేలాది మంది రైతులతో అనంతపురం రైల్వే స్టేషన్ నుంచి ప్రదర్శన ప్రారంభం అవుతుంది. ప్రదర్శన రైల్వే స్టేషన్ నుంచి శ్రీకంఠం సర్కిల్, సప్తగిరి, టవర్‌క్లాక్ మీదుగా బహిరంగ సభ జరిగే ఆర్ట్స్ కళాశాల గ్రౌండుకు చేరుకుంటుంది. అదే రోజు సాయంత్రం ప్రతినిధుల సభ ప్రారంభమవుతుంది.

ఢిల్లీ కేంద్రంగా ఏడాదిన్నరపాటు చారిత్రాత్మక రైతాంగం పోరాటం నడిపి ప్రధాని మోడీ మెడలు వంచిన రైతు ఉద్యమ రథ సారథులు ఈ సభలకు హాజరువుతున్నారు. రైతు వ్యతిరేక చట్టాలను రద్దు చేయాలని చరిత్రలో కనీవినీ ఎరుగని రీతిలో ఉద్యమాలు నడిపిన ఐక్య ఉద్యమాలు రథ సారధి, మాజీ సీనియర్ పార్లమెంట్ సభ్యులు, కిసాన్ సభ జాతీయ ప్రధాన కార్యదర్శి హన్నన్ మొల్లా హాజరవుతున్నారు. 2018లో మహారాష్ట్రలోని నాసిక్ నుండి బొంబాయి వరకు కిసాన్ లాంగ్‌మార్చ్‌ని నడిపి మహారాష్ట్ర ప్రభుత్వాన్ని గడగడ లాడించిన, రైతన్న సమస్యల పరిష్కారానికి పోరాటాలే ఊపిరిగా భావించి ఉద్యమాలు నడిపిన డాక్టరు అశోక్ ధావలే, విజ్జూకృష్ణన్ తదితర నాయకులు హాజరవుతున్నారు.






ప్రస్తుత మహాసభల నేపథ్యానికి వెళ్తే.. నేటికి రాయలసీమ సాగునీరు లేకుండా నిత్యం కరువులతో అల్లాడుతునే ఉంది. విభజన చట్టంలో పేర్కొన్న విధంగా ప్రత్యేక గ్రాంట్ ఇవ్వటం లేదు. రాయలసీమ ఈ స్థితి నుండి బయట పడటానికి ఈ మహాసభల్లో చర్చించి ఉద్యమ ప్రణాళిక రూపొందించబోతుంది. దీనితోపాటు వ్యవసాయ సంక్షోభం - పరిష్కార మార్గాలు; రైతు ఉద్యమం - భవిష్యత్తు- కర్తవ్యాలు; మద్దతు ధరల గ్యారెంటీ చట్టం - రైతులు ఆదాయాలు; సాగునీటి ప్రాజెక్టులు-వ్యవసాయ అభివృద్ధి; కేరళ తరహాలో రుణ ఉపశమన చట్టం తేవాలని తదితర అంశాలపై సెమినార్లు, సదస్సులు అనంతపురం, ఒంగోలు, గుంటూరు, విజయవాడ పట్టణాల్లో జరుగుతున్నాయి. మే 8న కిసాన్ సభ జాతీయ అధ్యక్షులు డాక్టరు అశోక్ ధావలే తొలిసారి అనంతపురం సెమినార్‌కు హాజరవుతున్నారు.

దేశంలో 65 శాతం గ్రామీణ ప్రజలు వ్యవసాయపై ఆధారపడి జీవిస్తున్నారు. కోట్లాది మంది రైతాంగం తమ రక్త మాంసాలను స్వేదంగా మార్చి ఆహార ధాన్యాలు పండించి సమాజానికి ఆహారం అందిస్తున్నారు. పారిశ్రామిక రంగానికి అవసరమైన ముడి వ్యవసాయ ఉత్పత్తులను పండించి పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడుతున్నారు. కరువు, కాటకాలను అధిగమించారు. కరోనా వంటి ప్రమాదకరమైన మహమ్మారిని ఎదుర్కొన్నారు. పండించిన పంటలకు గిట్టుబాటు ధరలు రావటం లేదు. ప్రతి ఏటా వ్యవసాయ ఖర్చులు పెరిగి సాగు భారంగా మారింది. ప్రభుత్వ రంగం బ్యాంకుల నుండి రుణాలు అందక వడ్డీ వ్యాపారస్తులపై ఆధారపడి వ్యవసాయ సాగుతోంది. ప్రకృతి వైపరీత్యాలు, చీడపీడలు, అతివృష్టి, అనావృష్టి వల్ల వ్యవసాయ రంగం దెబ్బతిని తీవ్రమైన సంక్షోభంలో కూరుకుపోయింది. ఆదుకోవలసిన ప్రభుత్వాలే వ్యవసాయ రంగాన్ని కార్పొరేట్ శక్తులకు కట్టబెట్టడానికి రైతు వ్యతిరేక చట్టాలు తెస్తున్నాయి. రైతులు తమంతట తామే వ్యవసాయం నుండి తప్పుకోవటానికి అనివార్య పరిస్థితులను కేంద్ర ప్రభుత్వం సృష్టిస్తోంది.. అదాని, అంబానీ వంటి పారిశ్రామిక వేత్తలకు వ్యవసాయ రంగాన్ని కట్టబెట్టడం కోసం ఏకపక్ష చట్టాలు తీసుకు వస్తోంది.

ఈనాటికి రైతుల ఆదాయం పెరగలేదు. భారాలు రెట్టింపు అయినాయి. ఆత్మహత్యలు మరింతగా పెరిగాయి. నూటికి 90 శాతం రైతాంగం పీకల్లోతు అప్పుల్లో కూరుకు పోయి తీర్చే మార్గం లేక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఇందులో 90 శాతం కౌలు రైతులే. ఈ దుస్థితి నుండి రైతాంగాన్ని రక్షించుకునేందుకు, కార్పొరేట్ కంపెనీల నుండి వ్యవసాయాన్ని కాపాడుకునేందుకు మరో రైతాంగ పోరాటానికి అనంతపురం రైతు మహాసభలు వేదికగా మారబోతున్నాయి. ఈ మహాసభల్లో వ్యవసాయం, దాని అనుబంధం రంగాల్లో రైతుల సమస్యలపై చర్చ జరుగుతుంది. ముఖ్యంగా రైతు వ్యతిరేక చట్టాలు రద్దు చేయాలని, జరిగిన పోరాటాల సందర్భంగా కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన హామీ ప్రకారం మద్దతు ధరల గ్యారెంటీ చట్టం తీసుకురావాలని ,విద్యుత్ ప్రైవేటీకరణ బిల్లును ఉపసంహరించుకోవాలని, ఉద్యమం సందర్భంగా రైతాంగంపై పెట్టిన కేసులను ఉపసంహరించుకోవాలని, దేశవ్యాప్తంగా ఒక పర్యాయం రైతుల, కౌలురైతుల అప్పులను మాఫీ చేయాలని, రుణ ఉపశమన చట్టం తీసుకు రావాలని డిమాండ్ చేస్తూ తీర్మానాలు చేయబోతున్నాయి. సహకార రంగాన్ని మరింత బలపరిచి రైతాంగాన్ని భాగస్వామ్యం చేయాలని, గొర్రెల- మేకల పెంపకం అభివృద్ధి చేయడం ద్వారా ఉపాధి కల్పించాలని, పట్టు పరిశ్రమను, కొబ్బరి పరిశ్రమను, డెయిరీ, ఉద్యానవన పంటల అభివృద్ధి, పంటల వారీగా పలు అంశాలపై చర్చించున్నారు. రైతాంగం ఉద్యమం -అభివృద్ధి, ఐక్య ఉద్యమాలు ప్రాధాన్యత, రైతాంగం భవిష్యత్తు, స్థానిక కమిటీలు -స్థానిక పోరాటాలు, రైతాంగం -సోషలిజం, తదితర అంశాలపై కమిషన్లు వేసి చర్చలు జరపబోతున్నారు.

ఇప్పటికే జిల్లా మొత్తంగా ఏడు నియోజకవర్గాల్లో రైతాంగ సమస్యలపై సదస్సులు జరిగాయి. ఆ సందర్భంగా వందలాది మంది రైతులు పాల్గొన్నారు. మహాసభల నిర్వహణకు మావంతుగా సహాయ సహకారాలు అందిస్తామని రైతాంగం ప్రకటించారు. 31 మండలాలలో మహాసభలో గురించి ప్రచారం చేశారు. వ్యవసాయం దండగ కాదు పండగని, ఆత్మహత్యలను నివారించాలని వ్యవసాయాన్ని సంక్షోభం నుంచి కాపాడాలని, రైతుల భూములను కార్పొరేట్ శక్తుల పరంగాకుండా సరళీకృత ఆర్థిక విధానాలు తిప్పికొట్టాలని, మద్దతు ధరల గ్యారెంటీ చట్టం తేవాలని, ఒక పర్యాయం రైతుల అప్పులు మాఫీ చేయాలని తదితర డిమాండ్లతో అనంతపురం జిల్లాలో గోడరాతలు ఎక్కడ చూసినా కనిపించే విధంగా ఆకర్షణీయంగా తీర్చిదిద్దుతున్నారు. అంతేకాకుండా వ్యవసాయ సంక్షోభం రైతాంగ ఉద్యమాలు అనే అంశంపై మే 8న అనంతపురంలో సెమినార్ నిర్వహిస్తున్నారు. మహసభల సందర్భంగా పిల్లలతో డ్రాయింగ్, కవితల పోటీలు,పోరాటాల ఘటనలతోను,వ్యవసాయ పరిస్థితులు ప్రతిబింబించే ఎగ్జిబిషన్ నిర్వహిస్తున్నారు. ఏప్రిల్ 25వ తేదీన గ్రామీణ వ్యవసాయం, గ్రామీణ ఆటలు,పాటలు, పోటీలు నిర్వహిస్తున్నారు. వ్యవసాయంలో రైతాంగ కష్టాలు, సుఖాలు తెలుసుకోవటం కోసం తద్వారా వ్యవసాయ విజ్ఞానాన్ని అవగాహన చేసుకోవడ ఈ కార్యక్రమంలో బాల బాలికలను భాగస్వామ్యం చేస్తున్నారు. రైతాంగ ఉద్యమాలు- పోరాటాలు, రైతుల సమస్యలు- ప్రభుత్వ విధానాలు, ప్రతిబింబించే విధంగా ఎగ్జిబిషన్ నిర్వహించ డానికి కమిటీ ఏర్పాటు చేస్తోంది. ఈ విధంగా అనంతపురంలో మహాసభలు ఉత్సాహపూరితమైన వాతావరణంలో నిర్వహించడానికి కమిటీ ఏర్పడి కృషి చేస్తున్నది. ఈ సందర్భంగా ఉప కమిటీలు ఏర్పడి పనులు ప్రారంభించాయి. జిల్లా మొత్తంగా రైతుల్లో ప్రచారం చేయడానికి, తద్వారా చైతన్యం కలిగించడానికి ఇంటింటికి తిరిగి కరపత్రాలు పంచటం ద్వారా ప్రచారం నిర్వహిస్తున్నారు. మహాసభల నిర్వహణకు సహాయం కోసం ఏప్రిల్ 25, 26 తేదీల్లో జిల్లా వ్యాప్తంగా వేలాది మంది రైతులను కలవడానికి ప్రణాళిక వేశారు. ఈ విధంగా మహాసభలు ఎన్నడూలేని విధంగా జరపటానికి ఆహ్వాన సంఘం నిరంతరాయంగా కృషి చేస్తోంది. ఈ కృషిలో విద్యావంతులు, వ్యవసాయ నిపుణులు ,యువతీయువకులు తమ వంతు కృషి చేస్తూ సహకారం అందించడానికి ముందుకు వస్తున్నారు. చైతన్యవంతమైన, త్యాగాల నిలయమైన అనంతపురంలో తొలిసారి ఈ మహాసభలు జరగటం చారిత్రాత్మకమని రైతులు తమ అభిప్రాయాలను తెలియజేస్తున్నారు.

# ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం (ఏపికెఎస్)

## 22వ రాష్ట్ర మహాసభల సందర్భంగా కార్యక్రమాల వివరాలు

| తేదీ | కార్యక్రమం | | సమయం |
|---|---|---|---|
| మే 1 | అన్నదాత జీవితంపై చిత్రలేఖనం,<br>రైతు కతలు 18లోపు విద్యార్థులు | | ఉదయం 10 గంటలు |
| మే 8. | వ్యవసాయ సంక్షోభం - రైతు ఉద్యమాలు | వక్త : అశోక్‌ధావలే<br>ఏఐకెఎస్ అధ్యక్షులు<br>ఢిల్లీ రైతు ఉద్యమ నేత | ఉదయం 10 గంటలు |
| మే 15 | రైతు కవనం - కవి సమ్మేళనం | | ఉదయం 10 గంటలు |
| మే 22 | పూర్వ రైతు ఉద్యమ నేతల<br>కుటుంబ సభ్యుల సమ్మేళనం<br>కామ్రేడ్ గణే నాయక్<br>జీవిత పుస్తకావిష్కరణ | ఆవిష్కర్త : బి.వి.రాఘవులు<br>సిపిఎం పొలిట్‌బ్యూరో సభ్యులు | ఉదయం 10 గంటలు |
| మే 26 నుంచి<br>29 దాకా | ఫోటో ఎగ్జిబిషన్<br>జిల్లా వ్యవసాయం<br>రైతు, సాహిత్య ఉద్యమ నేతల చరిత్ర | | ప్రతిరోజూ ఉదయం<br>10 గంటలకు నుండి<br>రాత్రి 7 గంటల వరకు |
| మే 27 నుంచి<br>29 దాకా | గ్రామీణ సాంస్కృతిక ఉత్సవాలు | | ప్రతిరోజూ సాయంత్రం<br>6 గంటల నుంచి<br>రాత్రి 7 గంటల వరకు<br>27వ తేదీ పౌరాణిక నాటికలు, పాటలు<br>28వ తేదీ సాంఘిక నాటికలు, పాటలు<br>29వ తేదీ జానపద నృత్యాలు |
| మే 28 | రైతు ప్రదర్శన<br>బహిరంగ సభ | రైల్వే స్టేషన్ నుంచి ఆర్ట్ కాలేజీ వరకు<br>ఆర్ట్ కాలేజీ గ్రౌండ్ లో | ఉదయం 10:30<br>ఉదయం 11.30 |



# కోర్టులో లొంగిపోయిన అశీష్ మిశ్రా

దేశవ్యాప్తంగా సంచలనం సృష్టించిన లఖీంపూర్ ఖేరీలో రైతులపై హత్యాకాండ కేసులో కేంద్రమంత్రి అజరు మిశ్రా కుమారుడు ఆశీష్ మిశ్రా ఏప్రిల్ 24న కోర్టులో లొంగిపోయాడు. ఈ కేసులో ఆశీష్ మిశ్రా బెయిల్‌ను సుప్రీంకోర్టు ఏప్రిల్ 18న రద్దు చేసింది. వారం రోజుల్లో లొంగిపోవాలని ఆదేశించింది. ఈ నేపథ్యంలో తప్పనిసరి పరిస్థితుల్లో ఒక రోజు ముందుగానే ఆశీష్ మిశ్రా లొంగిపోయాడు. 'మాకు వారం రోజుల వ్యవధి ఇచ్చారు. ఏప్రిల్ 25 చివరిరోజు. కానీ ఒక రోజు ముందే ఆశీష్ మిశ్రా లఖీంపూర్ కోర్టులో లొంగిపోయాడు' అని ఆయన తరుపు లాయర్ అవదేశ్ సింగ్ మీడియాకు చెప్పారు. భద్రతా కారణాలతో ఆశీష్‌ను జైలులోని ప్రత్యేక బారక్‌లో అధికారులు ఉంచారు. గతేడాది అక్టోబర్ 3న లఖీంపూర్ ఖేరీలో ఉత్తరప్రదేశ్ ఉప ముఖ్యమంత్రి కేశవ్ ప్రసాద్ మౌర్య పర్యటన సందర్భంగా అక్కడ నిరసన చేస్తున్న రైతులపైకి వాహనం ఎక్కించి ఆశీష్ మిశ్రా రైతులను హత్య చేసినట్లు అభియోగాలు ఎదుర్కొంటున్న సంగతి తెలిసిందే. ఆ రోజు హింసాకాండలో మొత్తం 8 మంది మరణించారు. ఈ కేసులో ఆశీష్ మిశ్రాను అరెస్టు చేసినా అతనికి అలహాబాద్ హైకోర్టు బెయిల్ మంజూరు చేసింది. దీనిని వ్యతిరేకిస్తూ బాధిత రైతు కుటుంబాలు సుప్రీంకోర్టును ఆశ్రయించడంతో ఆశీష్‌కు బెయిల్ ఇవ్వడాన్ని అది తీవ్రంగా ఆక్షేపించింది. బెయిల్ ఇవ్వడం ద్వారా బాధితులకు 'న్యాయమైన, సమర్థవంతమైన విచారణ' నిరాకరించినట్లేనని పేర్కొంటూ అతని బెయిల్‌ను రద్దు చేసి వారంలోగా లొంగిపోవాలని ఆదేశాలు జారీ చేసింది. ఈ నేపథ్యంలో ఆశీష్ కోర్టులో లొంగిపోయారు.

# వ్యవసాయ సంక్షోభ పరిష్కారానికి మార్గం ఐక్య పోరాటాలే

## విజయవాడ, గుంటూరు సదస్సుల్లో ఎఐకెఎస్ అధ్యక్షుడు అశోక్‌ధావలే పిలుపు



గుంటూరు సదస్సులో మాట్లాడుతున్న అశోక్‌ధావలే



విజయవాడ సెమినార్‌లో మాట్లాడుతున్న అశోక్‌ధావలే

రైతాంగం తమ సమస్యల నుంచి బయటపడాలంటే గ్రామస్థాయి నుంచి జాతీయ స్థాయి వరకు తమ బలాన్ని పెంచుకోవాలని అఖిల భారత కిసాన్ సభ (ఎఐకెఎస్) అధ్యక్షులు అశోక్ ధావలే పిలుపునిచ్చారు. 'వ్యవసాయ రంగ సంక్షోభం – పరిష్కార మార్గాలు' అనే అంశంపై విజయవాడలోని మాకినేని బసవ పున్నయ్య విజ్ఞాన కేంద్రం (ఎంబివికె)లో ఆంధ్రప్రదేశ్ రైతుసంఘం, కౌలు రైతుల సంఘం సంయుక్త ఆధ్వర్యాన నిర్వహించిన సదస్సులో ధావలే ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ.. బిజెపి పాలనలో రైతుల పరిస్థితి మరింత దిగజారిపోయిందని, పూర్తిగా నష్టాలు, అప్పుల ఊబిలో కూరుకుపోయారని ఆందోళన వ్యక్తం చేశారు. సంక్షోభం నుంచి రైతన్నలు బయటపడాలంటే కేంద్రం కనీస మద్దతు ధర పెంచి, చట్టబద్ధత కల్పించాలని డిమాండ్ చేశారు. ప్రకృతి విపత్తులు వచ్చినప్పుడు సమగ్ర పంటల బీమాను అమలు చేయాలని కేంద్రంపై ఒత్తిడి తేవాలని సూచించారు. కార్పొరేట్లు, భూస్వాములకే బ్యాంకులు విరివిగా రుణాలు ఇస్తున్నాయని, 75 శాతం మంది కౌలు రైతులకు ఇవ్వడం లేదని తెలిపారు. ప్రతి రైతుకూ బ్యాంకులు సున్నా శాతం వడ్డీకి లోన్లు ఇచ్చేలా కేంద్రం చర్యలు తీసుకోవాలని రైతాంగం డిమాండ్ చేయాలన్నారు. కార్మిక చట్టాలు రద్దు చేసి 4 లేబర్ కోడ్‌లు తెస్తామంటున్న కేంద్రం చర్యలను తిప్పికొట్టి, కార్మిక చట్టాలను కాపాడుకోవాలని కోరారు. వ్యవసాయ కార్మికుల సంక్షేమం కోసం రూపొందించిన ఉపాధి హామీ చట్టాన్ని కేంద్రం నీరుగారుస్తోందని, సంవత్సరంలో 200 రోజుల పని, రోజుకూలి రూ.500 నుంచి రూ.600 ఇవ్వాలని కేంద్రంపై ఒత్తిడి తేవాల్సి ఉందన్నారు. ఈ కార్యక్రమంలో ఎపి రైతుసంఘం రాష్ట్ర అధ్యక్షులు వై కేశవరావు, ఎపి కౌలురైతుల సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి పి జమలయ్య పాల్గన్నారు. సెమినార్‌కు ఎన్‌టిఆర్ జిల్లా రైతుంఘం కార్యదర్శి పివి ఆంజనేయులు అధ్యక్షత వహించారు. ఎపి కౌలురైతుల సంఘం జిల్లా కార్యదర్శి సిహెచ్ సైదులు వందన సమర్పణ చేశారు. ధావలే ప్రసంగాన్ని ఎ.కోటిరెడ్డి తెలుగులోకి అనువదించారు.

అంతకుముందు ఎపి రైతు సంఘం గుంటూరు జిల్లా మహాసభల సందర్భంగా నిర్వహించిన సదస్సులోనూ అశోక్‌ధావలే ప్రసంగించారు. దేశంలో 25 ఏళ్లలో 4 లక్షల మంది ఆత్మహత్య చేసుకున్నారని, బిజెపి అధికారంలోకి వచ్చాక ఎనిమిదేళ్లలోనే లక్ష మంది రైతులు బలయ్యారని ఆవేదన వ్యక్తం చేశారు. వ్యవసాయ సంక్షోభానికి కారణమైన ప్రభుత్వ విధానాలపై రైతులు ఉద్యమిస్తున్నారని, మహారాష్ట్ర, రాజస్థాన్, పంజాబ్ తదితర రాష్ట్రాల్లో పెద్ద ఎత్తున రైతు ఉద్యమాలు జరిగాయిని గుర్తు చేశారు. ఢిల్లీలో 380 రోజులపాటు జరిగిన నిర్విరామ ఉద్యమం చారిత్రాత్మకమైందని అన్నారు. ఎమ్మెల్సీ కె.ఎస్. లక్ష్మణరావు మాట్లాడుతూ.. ఆర్‌బికెలు రైతులకు 90 శాతం ఉపయోగపడటం లేదన్నారు. మిర్చికి తామర తెగులు సోకి జిల్లాలో 2 లక్షల ఎకరాల్లో పంట కోల్పోయినా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు పరిహారం ఇవ్వ లేదన్నారు. ఎపి రైతు సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులు వి.కృష్ణయ్య మాట్లాడుతూ.. తమది రైతు ప్రభుత్వమని ప్రకటించిన జగన్మోహనరెడ్డి రైతు వ్యతిరేక విధానాలను అమలు చేస్తున్నారని విమర్శించారు. బీమా ప్రీమియానికి రూ.101 కోట్లు విడుదల చేసినా ప్రభుత్వం కంపెనీ ఏర్పాటు చేయకపోవడం వల్ల రైతుల పంటలకు ప్రీమియం చెల్లించలేదని, ఫలితంగా బాధిత రైతులకు నష్ట పరిహారం లభించలేదని అన్నారు. సదస్సులో ఎపి కౌలు రైతు సంఘం రాష్ట్ర అధ్యక్ష కార్యదర్శులు వై.రాధాకృష్ణ, జి.జమలయ్య, రైతు సంఘం జిల్లా అధ్యక్షులు కె.అజయ్‌కుమార్, తెలుగు రైతు నాయకులు కె.రాజశేఖరరెడ్డి, రైతు సంఘం నేతలు రంగారెడ్డి, శివాజీ, ఈమని అప్పారావు, బి.శ్రీనివాసరావు, కిసాన్ ఫౌండేషన్ ఇడి కె.మురళీధరరావు, ఫైనాన్షియల్ డైరెక్టర్ బి.సూరయ్య చౌదరి, ఇంకా ఏవూరి గోపాలరావు జంపని రామారావు తదితరలు పాల్గొన్నారు.

# సహకార చక్కెర కర్మాగారాలను పున:ప్రారంభించాలి

## అఖిల భారత చెరకు రైతు సంఘ నేత రవీంద్రన్ డిమాండ్





సహకార రంగంలోని చక్కెర పరిశ్రమలను పున:ప్రారంభించాలని అఖిల భారత చెరకు రైతు సంఘం జాతీయ అధ్యక్షులు రవీంద్రన్ రాష్ట్ర ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. నెల్లూరు జిల్లా కోవూరు సహకార చక్కెర కర్మాగారం పరిరక్షణ కమిటీ ఆధ్వర్యంలో ఏప్రిల్ 23న సదస్సు నిర్వహించారు. సదస్సుకు ముఖ్య అతిథిగా విచ్చేసిన రవీంద్రన్ మాట్లాడుతూ.. రాష్ట్రంలోని ఆరు చక్కెర కర్మాగారాల్లోని ఆస్తులను లిక్విడేషన్ పేరుతో అమ్మే హక్కు ముఖ్యమంత్రికి ఎవరిచ్చారని ప్రశ్నించారు. రైతాంగ ఉద్యమానికి ప్రధాని మోడీయే దిగివచ్చారని, ఈ విషయం ఇక్కడి ముఖ్యమంత్రి గుర్తు పెట్టుకొని వ్యవహరించాలని హితవు పలికారు. తక్షణమే సిఎం రైతులకు చెందిన సహకార చక్కెర కర్మాగారాలకు నిధులు కేటాయించి తిరిగి పున: ప్రారంభించాలన్నారు. లేనిచో రాష్ట్రంలో ఒక్కొక్క సహకార చక్కెర కర్మాగారం నుంచి 500 మంది రైతుల చొప్పున మొత్తం మూడు వేల మంది రైతులతో అసెంబ్లీ ముట్టడిస్తామని హెచ్చరించారు. ఇప్పటి సిఎం ప్రతిపక్ష నాయకుడుగా ఉన్నప్పుడు రాష్ట్రంలో పాదయాత్ర నిర్వహించినప్పుడు.. తమ ప్రభుత్వం అధికారంలోకి వస్తే చక్కెర కర్మాగారాలను పున:ప్రారంభిస్తామని చెప్పారని, నేడు రాష్ట్రంలో ఆరు సహకార చక్కెర కర్మాగారాలను లిక్విడేషన్ పేరుతో కార్పొరేట్లకు తెగనమ్మేందుకు చూస్తున్నారని అన్నారు. దీనిపై రైతులతో కలిసి తీవ్ర ప్రతిఘటన తప్పదన్నారు. ఓ వైపు దేశంలో చక్కెర ఉత్పత్తి పెరుగుతుంటే మరోవైపు రాష్ట్రంలో చక్కెర కనుమరుగయ్యే దుస్థితి దాపురించిందన్నారు. గతంలో రాష్ట్రంలో 30 చక్కెర కర్మాగారాలు ఉండగా నేడు కేవలం ఐదు మాత్రమే కనబడుతున్నాయని పేర్కొన్నారు. దేశంలో 752 చక్కెర కర్మాగారాలు ఉన్నాయని ఇందులో 347 సహకార చక్కెర ఫ్యాక్టరీలున్నాయని తెలిపారు. రాష్ట్రంలోని 3 వేల కోట్ల విలువైన 20 వేలకు పైగా రైతులకు చెందిన 6 సహకార చక్కెర కర్మాగారాలను పున:ప్రారంభించేవరకూ పోరాటం తప్పదన్నారు. ఎపి రైతు సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి మర్రాపు సూర్యనారాయణ మాట్లాడుతూ.. హైకోర్టులో పిటిషన్ వేసి న్యాయ పోరాటం చేసేందుకు రైతులు సిద్ధంగా ఉండాలని సూచించారు. చెరకు రైతు సంఘం నాయకులు గండవరపు శీనయ్య సదస్సుకు అధ్యక్షత వహించారు. ఈ సదస్సులో రైతు సంఘం జిల్లా అధ్యక్షులు మూలి వెంగయ్య, వ్యవసాయ కార్మిక సంఘం జిల్లా కార్యదర్శి జొన్నలగడ్డ వెంకమరాజు, కౌలు రైతు సంఘం జిల్లా కార్యదర్శి జి. లక్ష్మీపతి, వైసిపి నాయకులు ఎర్రంరెడ్డి గోవర్ధనరెడ్డి, టిడిపి నాయకులు ఇంతా మల్లారెడ్డి, గునుపాటి ప్రసాద్‌రెడ్డి, చెరుకు రైతు సంఘం జిల్లా నాయకులు బిళ్లా రఘురామయ్య, కౌలు రైతు సంఘం రాష్ట్ర కమిటీ సభ్యులు తుళ్లూరు గోపాల్, రైతు సంఘం జిల్లా నాయకులు చంద్ర రాజగోపాల్, ఇంకా గండవరపు శేషయ్యతోపాటు సంగం, కొడవలూరు, విడవలూరు, బుచ్చి మండలాల నుంచి వచ్చిన రైతులు పాల్గొన్నారు.

# కౌలు రైతుల చట్టాన్ని సవరించకుండా రాయితీలు అసాధ్యం





**పి. జమలయ్య**
రాష్ట్ర ప్రధాన కార్యదర్శి,
ఆంధ్రప్రదేశ్
కౌలురైతుల సంఘం.

రాష్ట్ర ప్రభుత్వం 2022 సంవత్సరానికి కౌలురైతులకు సిసిఆర్‌సీ (క్రాప్ కల్టివేషన్ రైట్స్ కార్డ్స్), గుర్తింపు కార్డులు ఇవ్వాడానికి ఏప్రిల్ 1 నుండి 26 వరకు గ్రామ స్థాయిలో సభలు జరపాలని ఆదేశాలు జారీ చేశారు. కౌలు రైతుల్లో తగిన ప్రచారం లేదు. కరపత్రాల పంపిణీ లేదు. గ్రామ వాలంటీర్ల ద్వారా సమాచారం లేదు. రబీ పంట కాలం పూర్తి కాలేదు. కౌలు ఒప్పందాలు ఇంకా ప్రారంభమే కాలేదు. భూ యజమానులు కౌలు ఒప్పందంపై సంతకం పెడతారని గ్యారెంటీ లేదు. ఎవరైనా అంగీకరించిన ఆ భూమి అన్లైన్ నమోదు కాకపోతే కార్డులు రావు. దరఖాస్తు చేసుకున్న కార్డులకు పంట రుణాలు వస్తాయని నమ్మకం కలగటంలేదు. అనేక అటంకాలు ఉన్నాయి. వీటిని తొలగించకుండా కార్డులు జారీకి ఆదేశాలు ఇస్తే ఏమి ప్రయోజనం. ఇందులో రాష్ట్ర ప్రభుత్వ చిత్తశుద్ధి కనపడటం లేదు.

రాష్ట్రంలో ప్రొఫెసర్ ఆర్.రాధాకృష్ణ ఛైర్మన్‌గా ఉన్న (2016) ఆంధ్ర ప్రదేశ్ సుస్థిర వ్యవసాయ అభివృద్ధి కమిషన్, ఎన్ఎస్ఎస్ఓ 70వ రౌండ్ భూమి, పశు సంపద సర్వే గణంకాల ఆధారంగా రాష్ట్రంలో 24. 25 లక్షల మంది కౌలు రైతులు ఉన్నారని అంచనా. వారిలో 6.6 లక్షల 19 వేల మంది పూర్తిగా భూమిలేని కౌలు రైతులు. మరో 18.03 లక్షల మంది సొంత భూమితోపాటు కౌలు భూమిని సాగు చేస్తున్న కౌలు రైతులు ఉన్నారు. రాష్ట్రం మొత్తం 63.73.లక్షల ఎకరాల సాగు విస్తీర్ణంలో 27.15 హెక్టార్లను అంటే 44 శాతం విస్తీర్ణాన్ని కౌలు రైతులు సాగు చేస్తున్నారని అంచనా వేశారు. ఇంత పెద్ద మొత్తంలో కౌలు రైతులు ఉంటే రాష్ట్ర ప్రభుత్వం నుండి అందే సహాయ సహకారాలు శూన్యం. రోజు రోజుకు కౌలు వ్యవసాయ అన్ని పంటల్లోకీ, అన్ని ప్రాంతాలకూ విస్తరిస్తోంది. దీనితోపాటు కౌలురైతుల కష్టాలూ పెరుగుతున్నాయి. కౌలు సాగు భారంగా మారింది. ఆత్మహత్యలూ పెరుగుతున్నాయి. ప్రభుత్వం కౌలు రైతులను' ఆదుకునేందుకు ఎటువంటి ప్రయత్నాలు చేయటంలేదు. కౌలు రైతులు అనేక కష్టాలు ఎదుర్కోవడానికి 2019 సంవత్సరంలో రాష్ట్ర ప్రభుత్వం తీసుకువచ్చిన ఆంధ్రప్రదేశ్ పంట సాగుదారు హక్కుల చట్టమే ప్రధాన కారణమని చెప్పవచ్చు. ఈ చట్టం వల్లనే కౌలు రైతులు వ్యవసాయ రాయితీ పథకాలను పొందలేకపోతున్నారు.

వైఎస్‌పి నేతృత్వంలోని రాష్ట్ర ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తొలి ఏడాదిలో కౌలు రైతుల సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని "ఆంధ్రప్రదేశ్ పంట సాగుదారు హక్కుల చట్టాన్ని తెచ్చానని చెబుతోంది. ఈ శాసనమే కౌలు రైతులకు మరణ శాసనమైంది. ఆగస్టు 2019 నుండి అమలులోకి వచ్చింది .ఈ చట్టం ప్రకారం పంట సాగు హక్కు పత్రాన్ని కౌలు రైతుకు జారీ చేస్తారు. ఇంతకుముందు అమల్లో ఉన్న "ఆంధ్రప్రదేశ్ ల్యాండ్ లైసెన్స్‌డ్ కల్టివేటర్స్ చట్టం- 2011"ను ఏకపక్షంగా రాష్ట్ర ప్రభుత్వం రద్దు చేసింది. ఆంధ్రప్రదేశ్ కౌలుదారీ (రక్షణ చట్ట) 1956ను రద్దుకు పూనుకుంది. ఇది ప్రస్తుతం అమలుల్లోలేదు. కనుక ఇప్పటివరకు ఇచ్చిన రుణ అర్హత కార్డులు (ఎల్ఐసిలు), పంట ధ్రువీకరణ పత్రాలు (సిఓసిలు) ఇవ్వరాదని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. కౌలు రైతుల సంక్షేమం పేరుతో తీసుకు వచ్చిన చట్టం కౌలు రైతులకు శాపంగా మారింది. భూ యజమాన్నులకు, భూస్వాములకు వరంగా మారింది. ఈ చట్టాన్ని రూపొందించేటప్పుడే భూస్వాముల ప్రయోజనాలను కాపాడే విధంగా అనేక నిబంధనలను పొందుపర్చారు. కౌలు రైతుల ప్రయోజనాలను గాలికొదిలేశారు. ఈ చట్టం ప్రకారం కౌలు రైతులు సిసిఆర్‌సి కార్డులు పొందాలంటే భూ యజమాని కౌలు ఒప్పంద పత్రం రాసి ఇవ్వాలి. ఈ పత్రం భూ యజమానికి కౌలురైతుకు మధ్యగల కౌలు ఒప్పందాన్ని తెలియజేస్తుంది. దీని కాలపరిమితి కార్డు జారీ చేసిన తేదీ నుండి 11 నెలల వరకు ఉంటుంది. ఈ సాగుదారులు హక్కు పత్రంలో భూయజమాని, సాగుదారుల పేర్లు, సర్వే నంబరు, విస్తీర్ణం, దాని సరిహద్దులు పొందుపరుస్తారు. ఈ పత్రం ద్వారా భూ యజమాని హక్కులకు ఎటువంటి భంగమూ వాటిల్లదు. ఈ చట్టం కింద ఎలాంటి సాగుదారుడైనా, న్యాయ నిర్ణేత అధికారి ముందు యజమానికి వ్యతిరేకంగా భూమిపైగల హక్కులు తమకే చెందుతాయని సమర్థింపుగా అందుకు సాక్ష్యంగా ఈ పత్రాన్ని ఉపయోగించకూడదు. ఈ పత్రం ఉపయోగించి రెవెన్యూ అధికారి పట్టాదారుని భూమిపై హక్కును బదలాయించరాదని స్పష్టంగా వుంది.

ఈ చట్టంలోని సెక్షన్ 5(బి) ప్రకారం ఈ పత్రం ద్వారా కలిగే రుణార్హత సాగుదారునికి కాలవ్యవధిలో పండిన పంటపై మాత్రమే

హక్కు కల్పించింది. భూమిపై ఎటువంటి యాజమాన్య హక్కు కల్పించలేదు. భూమిపై సర్వహక్కులు భూయజమానికి మాత్రమే చెందును అని స్పష్టంగా పేర్కొన్నారు. ఈ పత్రంపై గ్రామ సచివాలయపు గ్రామ రెవెన్యూ అధికారి సాక్షి సంతకం చేస్తారని పేర్కొన్నారు. అసలు చిక్కు ఇక్కడే వచ్చి పడింది. కౌలు ఒప్పందం పత్రం మీద సంతకం పెట్టడానికి భూ యజమానులు, భూస్వాములు ఎవ్వరూ ముందుకు రావడం లేదు. గత మూడేళ్ల అనుభవాన్ని పరిగణనలోకి తీసుకుని చూస్తే మనకే అర్థమవుతుంది. చట్టం వచ్చినా మొదటి సంవత్సరంలో అంటే (2019) అక్టోబరు నుంచి ఏప్రిల్ వరకు ఇచ్చిన సిసిఆర్‌సి కార్డులు 2.72 లక్షల మందికి జారీ చేశారు. రెండో ఏడాది (2020) ఏప్రిల్ నుండి మార్చి వరకు 3.55 లక్షలు మందికి, గడిచిన (2021) సంవత్సరంలో 5 లక్షల మందికి కార్డులు ఇవ్వాలని లక్ష్యం పెట్టుకున్నారు. అందులో 4.14 లక్షల మందికి ఇచ్చి చేతులు దులుపుకున్నారు. వాస్తవానికి ఇచ్చిన కార్డుల్లో కూడా బోగస్ ఉన్నాయని అనేక ఉదాహరణలు వెలుగుచూశాయి.

ఇటీవల కాలంలో 'రైతు స్వరాజ్య వేదిక' కౌలురైతుల సమస్యలపై అధ్యయనం చేసింది. మొత్తం 9 జిల్లాలో 31 గ్రామాల్లో 3,855 మందిని సర్వే చేశారు. ఆ సర్వే ప్రకారం కౌలు భూమిపై పంట రుణం పొందిన వారు 2021 సంవత్సరంలో 12 మంది (3%), కౌలు రైతు గ్రూపు ద్వారా రుణం తెచ్చుకున్నవారు 19 (5%), కౌలు భూమిపై రైతు భరోసా పొందినవారు 63 మంది (17%), కౌలు భూమిపై భీమా పరిహారం పొందినవారు నలుగురు (1%), పంట నష్ట పరిహారం (ఇన్‌పుట్స్ సబ్సిడీ) అందిన వారు కేవలం ఒక్కరు (1%) ఉన్నారు. మార్కెటింగ్‌కు ఉపయోగపడిందని చెప్పిన వారు 37 మంది (10%), ఇతర లాభాలు జరిగాయని చెప్పిన వారు 18 మంది (5%), ఏమీ లాభం జరగలేదని చెప్పిన వారు 215 మంది (59%) ఉన్నారు. మొత్తం సిసిఆర్‌సిలు పొందినవారు 364 మంది ఉన్నారు.

ఈ గణంకాలను పరిశీలించినపుడు ఈ చట్టం ఎంత లోపభూయిష్టంగా ఉందో అర్థం అవుతుంది. ఈ చట్టంలోని సెక్షన్ 5(సి) ప్రకారం సాగుదారులు ఈ పత్రం ద్వారా రైతు భరోసా- పీఎం కిసాన్, పంటల బీమా, ఉత్పాదకాల సబ్సిడీ, పంట నష్టపు పశమనాన్ని మాత్రమే పొందగలరని ఉంది. భూయజమాని గుర్తింపు కార్డుకు అంగీకరించనందున కౌలురైతులు పైవన్నీ కోల్పోయి నష్టపోతున్నారు. భూమిపై ఎటువంటి స్వాధీన హక్కులుగాని కౌలు, ఇతర హక్కులు పొందలేరని పేర్కొన్నారు. అయినప్పటికీ భూమి భూ యజమానులు కౌలు రైతులకు సహకరించటంలేదు. ఈ పత్రం, కౌలు రైతు పంట రుణాలు పొందటానికి సహాయ పడుతుందని, బ్యాంకర్లుకూడా ఈ పత్రంగల కౌలురైతుకు ఇతర పత్రాలను సమర్పించమని ఒత్తిడి తీసుకు రాకుండానే.. కేవలం ఈ పత్రంపై రుణాలు మంజూరు చేయాలనే నిబంధనలను పెట్టారు. అంతేగాక ప్రభుత్వ రంగ బ్యాంకులు తదితర ఆర్థిక సంస్థలు ఈ కార్డుదారునికి ఇచ్చిన పంటరుణాన్ని తిరిగి వసూళ్లు చేసుకోవడంలో ఫలసాయంపై మాత్రమే హక్కు కలిగి వుంటారు తప్ప భూమిపై కలిగి ఉండరు అని ఉంది. చట్టంలో నిబంధనలు పరిశీలిస్తే కౌలు రైతులకు ఎంతో మేలు చేసే చట్టం తెచ్చారో అని అనిపిస్తుంది. రిజర్వు బ్యాంకు నింబందనల ప్రకారం ఎటువంటి ష్యూరిటీ లేకుండా రూ.1.60 లక్షలు పంట రుణాలు తీసుకోవచ్చుని చెప్పారు. కానీ ఆ నిబంధనలు అమలు చేయరు. ఎందుకు అమలు చేయదో రాష్ట్ర ప్రభుత్వం నోరు విప్పదు.

స్థానికంగా కౌలు రైతులు వెళ్లి రుణాలు ఇవ్వాలని అడిగితే భూస్వామి తీసుకు వెళ్ళాడని చెబుతున్నారు. పైగా కౌలు రైతులకు పంట రుణాలు ఇవ్వాలని ఆదేశాలు రాలేదని చెబుతున్నారు. ప్రభుత్వ సమీక్షలు తప్ప ఫలితం శూన్యం. రాష్ట్ర ప్రభుత్వం నుండి రైతు భరోసా అందాలన్నా, పంటలు అమ్ముకోవాలన్నా, వడ్డీ రాయితీ, విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు, వ్యవసాయ యంత్ర పరికరాలు తీసుకోవలన్నా గుర్తింపు కార్డులు కావాలి. కనీసం పంటలకు మద్దతు ధరకు అమ్ముకోవాలంటే ఈ-క్రాఫ్ బుకింగ్ నమోదు కావాలి. అది జరగలన్నా గుర్తింపు కార్డులు తప్పనిసరి అని వ్యవసాయాధికారుల ఆదేశాలు ఉన్నాయి. ఈ కార్డులు పొందటానికి గ్రామ సచివాలయం, గ్రామ వాలంటీర్లు, సాగు రైతుకు మధ్య ఈ చట్టం అమలులో అనుసంధానకర్తగా వ్యవహరిస్తారని చట్టం చెబుతోంది. ఇది వట్టి భూటంకం. భూ యజమాని అందుబాటులో లేకపోతే లేదా రైతు అంగీకార పత్రం ఎలక్ట్రానిక్ పద్ధతి (ఈ మెయిల్ లేదా వీడియో కాన్ఫరెన్స్, మొదలైనవి) ద్వారా ఇవ్వవచ్చు. ఇలా ఇచ్చిన పత్రాలను నిర్దేశిత అధికారి (వీఆర్ఓ) ధ్రువీకరించి కార్డులు జారీ చేస్తారని, తద్వారా కౌలు రైతులు ప్రయోజనం పొందుతారని పేర్కొన్నారు. అచరణలో సాధ్యం కావటంలేదు. వీఆర్ఓలు భూ యజమానులను కౌలు ఒప్పందం మీద సంతకం పెట్టండని చెప్పే ధైర్యమూ, ఆధికారమూ లేదు. వారు చిరు ఉద్యోగులు. అధికారాలు ఉన్న తహసీల్దారును అడిగితే నా చేతిలో ఏమి లేదు లేదు. వీఆర్ఓను అడగమని అంటున్నారు. ఈ విధంగా జగన్ ప్రభుత్వం కౌలు రైతులకు మేలు చేయటానికి ఉందని చెబుతూ అచరణలో అందుకు విరుద్ధంగా వ్యవహరిస్తోంది. ఆత్మహత్యలు చేసుకున్న కుటుంబాలవారు ఎక్స్‌గ్రేషియా పొందాలన్న సిసిఆర్‌సిలు కావాల్సిందే.

ఇప్పటికైనా రాష్ట్ర ప్రభుత్వం కౌలురైతుల సమస్యల పట్ల దృష్టి సారించాలంటే గుర్తింపు కార్డులు జారీ చేయాలి. అందుకుగాను సిసిఆర్‌సి చట్టాన్ని సవరించాలి. కౌలు రైతులు సులభంగా కార్డులు పొందాలంటే గ్రామసభల్లోని కౌలు రైతులను గుర్తించి అక్కడక్కడే కార్డులు జారీ చేయాలి. భూ యజమానికి పంట రుణాలు ఇవ్వకుండా బ్యాంకుల నిబంధనలు మార్చాలి. ఆదేవిధంగా రైతు భరోసా పొందటానికి భూస్వాములకులేని నింబంధనలను కౌలు రైతులకు పెట్టడం అన్యాయం. ఈ నిబంధనలు కూడా సడలించి భూమిలేని కౌలురైతులకు పెట్టబడి సాయం ఇవ్వాలి. తక్షణమే చట్టాన్ని సవరించడానికి చర్యలు చేపట్టాలి. ఈ ఖరీఫ్ సీజన్ నాటికైనా వ్యవసాయ పథకాలు కౌలు రైతులకు అందే విధంగా దృష్టి పెట్టాలి.

**(వ్యాసకర్త : రాష్ట్ర ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ కౌలు రైతుల సంఘం)**

# ఎనిమిది మంది కౌలు రైతుల ఆత్మహత్య



మన రైతువాణి బ్యూరో : ఏప్రిల్ నెలలో ఇప్పటివరకూ అప్పుల బాధతో ఏడుగురు కౌలు రైతులు, ఓ రైతూ మొత్తం ఎనిమిది మంది ఆత్మహత్య చేసుకున్నారు. వీరిలో ముగ్గురు బాపట్ల జిల్లాలోనూ, ఇద్దరు పల్నాడు జిల్లాలోనూ, గుంటూరు, ప్రకాశం, అనంతపురం జిల్లాల్లోనూ వున్నారు. పోలీసులు, కుటుంబ సభ్యులు తెలిపిన వివరాల ప్రకారం.. పల్నాడు జిల్లా కారంపూడి మండలం గాదెవారిపల్లి గ్రామానికి చెందిన బైరెడ్డి శ్రీనివాస్‌రెడ్డి (38) కొన్నేళ్లుగా తనకున్న ఎకరం పొలంతోపాటు మరో రెండెకరాలను కౌలుకు తీసుకుని మిర్చి పంట సాగు చేశాడు. ఈ ఏడాది పైరుకు తెగులు సోకి తీవ్రంగా నష్టపోయాడు. రూ.5 లక్షల వరకు అప్పులయ్యాయి. తీవ్ర ఒత్తిడికి గురైన శ్రీనివాస్‌రెడ్డి రెండు రోజుల క్రితం ఇంటి నుండి వెళ్లిపోయి తాను సాగుచేస్తున్న పొలంలోనే చెట్టుకు ఉరి వేసుకున్నాడు. పల్నాడు జిల్లా నరసరావుపేట మండలం పమిడిపాడు గ్రామానికి చెందిన కౌలు రైతు వెంకటేశ్వర్లు (38) ఆరెకరాలు కౌలుకు తీసుకుని పత్తి, మిర్చి, వరి పంటలు సాగు చేశాడు. అధిక వర్షాలు, తెగుళ్లతో పంటలు దెబ్బతిన్నాయి. పంట సాగు కోసం చేసిన రూ.12 లక్షల అప్పులకు వడ్డీలు అధికమయ్యాయి. రుణదాతల ఒత్తిడి, అప్పు తీరే మార్గం లేక పురుగుల మందు తాగి ఆత్మహత్య చేసుకున్నాడు. బాపట్ల జిల్లా పంగులూరు మండలంలోని చందలూరుకు చెందిన సర్ధన వీరాంజనేయులు (50) కర్ణాటక రాష్ట్రంలోని బళ్లారిలో పదేళ్లపాటు వ్యవసాయ చేసి నష్టాలు చవి చూశాడు. దీంతో సొంతూరైన చందలూరుకు పదేళ్ల కిందట వచ్చి ఇక్కడా కౌలు వ్యవసాయం మొదలుపెట్టాడు. ఈ ఏడాది ఎనిమిదెకరాల్లో మిర్చి సాగు చేయగా తామర వైరస్ సోకి పంట మొత్తం దెబ్బతింది. పంటల సాగు నిమిత్తం సుమారు రూ.20 లక్షల వరకు అప్పులు చేశాడు. అప్పులు తీర్చే మార్గంలేక తాను వ్యవసాయం చేస్తున్న పొలంలో అధిక మోతాదులో షుగరు బిళ్లలు మింగి ఆత్మహత్య చేసుకున్నాడు. బాపట్ల జిల్లాలోనే మార్టూరులోనూ మారెళ్ల చిన చెన్నయ్య (55) కూడా ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ జిల్లాలోని ఇసుకదర్శిని గ్రామానికి చెందిన మారెళ్ల చిన చెన్నయ్య కర్నాటక రాష్ట్రం గుల్బర్గా జిల్లాలోని జవిరిగేలో 20 ఎకరాలు కౌలుకు తీసుకుని ఎనిమిదేళ్లపాటు పత్తి, మిర్చి సాగు చేశాడు. ప్రతి ఏటా నష్టాలు రావడంతో గతేడాది సొంతూరుకు వచ్చి తన అర ఎకరంతోపాటు మరో ఎనిమిది ఎకరాలు కౌలుకు తీసుకున్నాడు. అధిక వర్షాలు, తెగుళ్లతో మిర్చి పంట పూర్తిగా దెబ్బతింది. సాగు నిమిత్తం రూ.11 లక్షల వరకూ అప్పు చేశాడు. పంట చేతికి రాకుండానే అప్పులిచ్చిన వారి నుంచి వత్తిడి పెరగడంతో లొద్దిగుంట డొంక వద్ద చెట్టుకు ఉరేసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. కృష్ణా జిల్లా రమణక్కపేటకు చెందిన ఉప్పె భాస్కర్ (40) దంపతులు బతుకుదెరువు నిమిత్తం ఐదేళ్లక్రితం గుంటూరు జిల్లాలోని మంగళగిరి-తాడేపల్లి నగరపాలక సంస్థ పరిధి యర్రబాలెంకు వచ్చారు. యర్రబాలెంలో కొంత, పల్నాడు జిల్లా సత్తెనపల్లి వద్ద మరికొంత భూమి కౌలుకు తీసుకున్నాడు. మొత్తంగా ఆరుఎకరాలు కౌలుకు తీసుకొని పలు పంటలు సాగుచేసేవాడు. వరుసగా నష్టాలు రావడంతో అప్పుల భారం అధికమైంది. రూ.15 లక్షల అప్పు తీరేదారిలేక భాస్కర్ పురుగుల మందు తాగి ఆత్మహత్య చేసుకున్నాడు. ప్రకాశం జిల్లా పొదిలి మండలం కాటూరివారిపాలెం గ్రామానికి చెందిన యువ రైతు రామ్మూర్తి (25) గతేడాది తనకున్న రెండకరాలతోపాటు మరో 130 ఎకరాల్లో బొబ్బర్లు, కంది పంటలు వేశారు. పంట దిగుబడి బాగానే వచ్చినా పంటకు గిట్టుబాటు ధర లభించక ఆర్థికంగా నష్టపోయాడు. దీనికితోడు తండ్రి అనారోగ్యానికి వైద్యం చేయాల్సి వచ్చింది. సాగు నిమిత్తం చేసిన రూ.20 లక్షల అప్పు తీర్చే మార్గం కనిపించలేదు. దీంతో రావిపాడు గ్రామంవలో ఉంటున్న అక్క ఇంటికి వెళ్లిన రామ్మూర్తి అక్కడ ఉరేసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. అలాగే ఏప్రిల్ 23న అనంతపురం జిల్లాలో ఓ రైతు, బాపట్ల జిల్లాలో ఓ కౌలు రైతు మరణించారు. అనంతపురం జిల్లా శెట్టూరు మండలం యాటకల్లు గ్రామానికి చెందిన గొల్ల రాజన్న(36) ఐదెకరాల సొంత పొలంలో వర్షాధార పంటలు సాగు చేసేవాడు. పంటల సాగు నిమిత్తం ఇప్పటి వరకు రూ.ఐదు లక్షలు అప్పు చేశాడు. గడిచిన మూడు సంవత్సరాలు పంటలు దక్కకపోవడంతో రుణభారం అధికమైంది. అప్పులు తీరే దారిలేక పొలం వద్దే చెట్టుకు ఉరేసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. బాపట్ల జిల్లా పంగులూరు మండలం బూదవాడ గ్రామానికి చెందిన తేళ్ల జేమ్స్ (48) గత పది సంవత్సరాలుగా ఏడు ఎకరాలను కౌలుకు తీసుకుని వ్యవసాయం చేస్తున్నాడు. ఈ ఏడాది ఐదెకరాల్లో మిర్చి, రెండు ఎకరాల్లో మినుము పంట వేశాడు. తెగుళ్లు, అకాల వర్షాలతో పంట పూర్తిగా పాడైపోయింది. దీంతో మిర్చి, మినుము తొలగించి జన్న పంట వేశాడు. ఆశించిన మేర పంట దక్కకపోవడంతో తీవ్ర మనోవేదనకు గురయ్యాడు. పంటల సాగు నిమిత్తం సుమారు రూ.8 లక్షల వరకు అప్పులు చేశారు. రుణదాతల ఒత్తిడి తాళలేక పురుగుల మందు తాగి ఆత్మహత్య చేసుకున్నాడు.

**ఈ ఆత్మహత్యల పరంపరకు అంతం ఎప్పుడు?**



# అడ్రస్ లేని అగ్రి మిషన్

రైతులు నిరంతరం ఎదుర్కొనే సమస్యలపై చర్చించి ఎప్పటి కప్పుడు కార్యాచరణ రూపొందించే బృహత్తర లక్ష్యంతో ఏర్పాటైన రాష్ట్ర వ్యవసాయ మిషన్ అడ్రస్ లేకుండా పోయింది. సాక్షాత్తు ముఖ్యమంత్రి ఛైర్మన్‌గా వేసిన మిషన్ కనీసం సమావేశాలకూ నోచుకోవట్లేదు. మిషన్ చివరి భేటీ 2020 జనవరిలో నిర్వహించారు. సమావేశం జరిగి రెండేళ్లు దాటిపోయింది. అసలు మిషన్ ఉనికిలో ఉందో లేదో కూడా అనుమానమే. కోవిడ్ ఆపత్కాలంలో మార్కెట్ సౌకర్యాలు అస్తవ్యస్థమై రైతులు తీవ్ర అవస్థల పాలవగా సరిగ్గా ఇప్పుడే వ్యవసాయ మిషన్ కార్యకలాపాలు పూర్తిగా పడకేశాయి. ఈ కాలంలో వ్యవసాయంపై సాధారణ స్థాయి సమీక్షా సమావేశాలు మినహా అగ్రి మిషన్‌ను సమావేశ పర్చలేదని విమర్శలొస్తున్నాయి.

### తొలుత ఆశాజనకం

వ్యవసాయ రంగాన్ని అభివృద్ధి పథంలో నడిపించడం కోసమంటూ 'వ్యవసాయ మిషన్'ను వైసిపి అధికారంలోకి రాగానే 2019 జులైలో నెలకొల్పింది. ముఖ్యమంత్రే మిషన్‌కు ఛైర్మన్ కావడం, సంబంధిత మంత్రులను, ఉన్నతాధి కారులను, నిపుణులను, రైతు, వ్యాపార ప్రతినిధులను సభ్యులుగా వేయడంతో రైతుల్లో కొత్త ఆశలు చిగురించాయి. విధిగా నెలకోసారి సిఎం అధ్యక్షతన మిషన్ భేటీ ఉంటుందని ఉత్తర్వుల్లో సైతం పేర్కొన్నారు. మిషన్‌ను నెలకొల్పిన తొలినాళ్లలో భేటీలు జరగ్గా, తర్వాత్తర్వాత మొక్కుబడిగా మారాయి.

### రైతు చిత్తయినా..

కరోనా పరిస్థితులు, డీజిల్, పెట్రోలు ధరల బాదుడు వలన సాగు ఖర్చులు పెరిగాయి. రైతులు పండించిన ఏ పంటకూ ధర లేదు. విపత్తులు వెంటాడి రైతులను భారీగా నష్టపర్చాయి. ధాన్యం, పత్తి, మిర్చి, బత్తాయి, ఉల్లి, టమాటా, పసుపు రైతుల బాధలు చెప్పనలవి కాదు. ప్రభుత్వ సంస్థల కొనుగోళ్లు, మార్కెట్‌లో జోక్యం అస్తుపిస్తే. పంట వేసే ముందే ధరల నిర్ణయం, మార్కెట్ ఇంటెలిజెన్స్, అందుకనుగుణంగా పంటల సరళిలో మార్పులు, అధ్యయనాలు, చర్చలు, వ్యూహాత్మక పత్రాల రూపకల్పనకు వేసిన అగ్రి మిషన్ పత్తా లేకుండా పోయింది. రాష్ట్ర స్థాయి మిషన్ భేటీలే లేనందున జిల్లా స్థాయి మిషన్ సమావేశాలూ లేవు. వ్యవసాయ మిషన్ వైస్ ఛైర్మన్‌గా నియమితులైన ఎంవిఎస్ నాగిరెడ్డి కార్యాలయానికి సచివాలయంలో ఒక గది కేటాయించారంతే. సిబ్బంది, మౌలిక సదుపాయాలు నామమాత్రం. మిషన్‌ను ప్రతి నెలా సమావేశపర్చాల్సింది ఉపాధ్యక్షులే. ఆయనే ఎజెండా రూపొందించాలి. వ్యవసాయ మిషన్ అనడంతో ఇరిగేషన్, పశు సంవర్ధక, ఇత్యాది అనుబంధ శాఖలు పట్టించు కోవట్లేదు. దాంతో సాధికారత తెచ్చేందుకు వ్యవసాయ మిషన్ పేరును రైతు మిషన్‌గా మార్చాలని నాగిరెడ్డి ప్రభుత్వానికి, సిఎంకు లేఖలు రాశారు. వాటిపై ఎలాంటి నిర్ణయం తీసుకోలేదు. నాగిరెడ్డి ప్రజాశక్తితో మాట్లాడుతూ కొన్ని అనివార్య కారణాల వలన మిషన్ సమావేశం జరగలేదన్నారు. ఇదిలా ఉండగా మొన్నటి మంత్రివర్గ విస్తరణలో మిషన్‌లో సభ్యులైన మంత్రులందరూ మారారు. చాలా మంది అధికారులూ మారారు. ఇప్పుడొచ్చిన వారికి అసలు మిషన్‌పై అవగాహనే లేదంటున్నారు.

# ఆహార భద్రతకు ముప్పు

రాష్ట్ర ప్రభుత్వం చేపట్టబోతున్న బియ్యం బదులు నగదు ఇచ్చే కార్యక్రమంతో భవిష్యత్తులో ఆహార కొరత, పౌష్టికాహార లోపం తాండవం చేసే ప్రమాదం ఉందని ఆహార భద్రత నిపుణులు చెబుతున్నారు. రాష్ట్ర ప్రభుత్వం బియ్యం వద్దనుకునే వారికి కేజీకి రూ.10 నుంచి రూ.15 ఇవ్వాలని చూస్తోంది. దీనివల్ల భవిష్యత్తులో ఆకలి కేకలు పెద్దఎత్తున వినిపించే ప్రమాదం ఉందని నిపుణులు హెచ్చరికలు జారీ చేస్తున్నారు. ప్రభుత్వం ఖర్చు తగ్గించుకోవాలనే ఉద్దేశంతోనే ఇటువంటి విధానాన్ని తెరమీదకు తెచ్చిందనే ఆరోపణలు ప్రధానంగా వినిపిస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వం కార్పొరేట్లు, వ్యాపారస్తులకు లాభాలు చేకూర్చాలనే దురుద్దేశంతో బియ్యం ఇవ్వకుండా నగదు బదిలీ చేయాలని వివిధ రాష్ట్రాలపై ఒత్తిడి చేస్తోందని సమాచారం. నాణ్యతలేని బియ్యం ఇస్తే, ప్రజలు తప్పకుండా నగదు తీసుకుంటారనే ఆలోచనతో నాశిరకం బియ్యాన్ని కేంద్రం రాష్ట్రానికి పంపుతోంది. కొన్నిసార్లు బియ్యం పంపకుండా జాతీయ ఆహార భద్రత చట్టం (ఎన్ఎస్ఎఫ్ఎ) కింద కేంద్రం తన వద్ద ఉన్న 2011 జనాభా లెక్కల ప్రాతిపదికన ఏపికి కేవలం 90 లక్షల కార్డులకే (2,42,99,920 మందికి) రేషన్ లేదా దానికి సరిపడా నగదును కేజీకి రూ.36 చొప్పున రాష్ట్ర ప్రభుత్వానికి అందిస్తోంది. ప్రధాన మంత్రి గరీబ్ కళ్యాణ్ యోజన పథకం కింద కూడా కేంద్రం కేవలం ఈ 90 లక్షల కార్డులకే బియ్యం తాలూకా చెల్లింపులు చేస్తోంది. దీని ప్రభావంతో రాష్ట్ర ప్రభుత్వం మిగిలిన 56,06,681 కార్డులకు (1,55,68,927 మందికి) బియ్యం ఇవ్వలేక, ఆర్థికభారంతో విలవిల్లాడుతోంది. ఆర్థికభారం నుంచి ప్రభుత్వం తప్పించుకునేందుకు ప్రయత్నించేలా కేంద్రం కుట్రపూరితంగా వ్యవహరిస్తోంది. ఎన్ఎఫ్ఎస్ఎ కోటా పెంచాలని రాష్ట్ర ప్రభుత్వం కేంద్రాన్ని ఎన్నిసార్లు కోరినా పట్టించుకోలేదు. దీనివల్ల రాష్ట్రంలో పేదల సంఖ్య పెరగడంతో రాష్ట్ర ప్రభుత్వం సొంత ఖర్చులు పెట్టుకోవాల్సిన పరిస్థితి.

### పేదల్ని కొట్టి, కార్పొరేట్లకు పెట్టడమే కేంద్రం లక్ష్యం

కేజీకి రూ.15 చొప్పున నగదు చెల్లిస్తే, ప్రజలు వాటిని సులువుగా ఖర్చు చేసేస్తారు. వారికి తినడానికి బియ్యం ఉండవు. ఫలితంగా బహిరంగ మార్కెట్లో కొనుగోలు చేయాల్సిన పరిస్థితులు ఏర్పడతాయి. రిలయన్స్, డిమార్ట్, మెట్రో తదితర గుత్తపెట్టుబడిదారుల మాల్స్‌లో గంపగుత్తగా నిల్వలు పెట్టుకుని, బియ్యం ధరలను కార్పొరేట్లు ఇష్టానుసారం పెంచుకునే వీలు కలుగుతుంది. తినాలంటే ఖచ్చితంగా వారు పెట్టిన ధరకే బియ్యం కొనుగోలు చేయాలి. ఆ సమయంలో కేజీ బియ్యం రూ.100కు చేరే ప్రమాదం ఉందని ఆర్థిక నిపుణులు హెచ్చరిస్తున్నారు. అంబానీ, అదానీ వంటి బడా పెట్టుబడిదారుల కడుపు నింపడానికి, పేద ప్రజల నోటి వద్ద ముద్దను మోడీ లాక్కుంటున్నారంటూ మేధావులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.




### ఆర్థికభారం దింపుకోవడమే ప్రభుత్వ లక్ష్యం

రాష్ట్రంలో ప్రస్తుతం నాన్ ఎన్ఎస్ఎఫ్ఎ 56,06,681 రేషన్ కార్డులు (రాష్ట్ర ప్రభుత్వం జారీ చేసినవి), వాటిలో 1,55,68,927 మంది లబ్ధిదారులు ఉన్నారు. ఈ కార్డులన్నిటికీ నెలకు 7.78 కోట్లు కేజీల బియ్యాన్ని ప్రభుత్వం పంపిణీ చేస్తోంది. కేజీకి రూ.36 చొప్పున ప్రభుత్వం నెలకు రూ.280 కోట్లు, సంవత్సరానికి రూ.3,362.88 కోట్లు ఖర్చు పెడుతోంది. దీంతోపాటు బియ్యం పంపిణీ చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం మొబైల్ డెలివరీ యూనిట్ (ఎండియు)లు 9,260 నిర్వహిస్తోంది. దీనికి నెలకు ఒక్కో డ్రైవర్‌కు రూ.18 వేలు చొప్పున రూ.16.66 కోట్లు, ఏడాదికి రూ.200 కోట్లు భారం పడుతోంది. మొత్తంగా రాష్ట్ర ప్రభుత్వం నాన్ ఎన్ఎస్ఎఫ్ఎ కార్డులకు రేషన్ బియ్యం ఇచ్చేందుకు ఏడాదికి రూ.3,562.90 కోట్లు ఖర్చు చేయాల్సి వస్తోంది. దీని నుంచి తప్పించుకునేందుకు నాన్ ఎన్ఎస్ఎఫ్ఎ కార్డులకు నగదు బదిలీ చేయాలని భావిస్తోంది. బియ్యం వద్దనుకునే వారికి కేజీ బియ్యానికి రూ.15 ఇస్తామని చెబుతోంది. దీని పైలెట్ ప్రాజెక్టును రాష్ట్రంలో 5 మున్సిపాలిటీలు (గాజువాక, అనకాపల్లి, కాకినాడ, నరసాపురం, నంద్యాల)లో మే నెలలో నిర్వహించాలని పౌరసరఫరాలశాఖ కమిషనరు ఆయా మున్సిపాలిటీల అధికారులకు సర్క్యులర్ పంపారు.

రాష్ట్రం మొత్తం బలవంతంగా అయినా నగదు బదిలీ విధానాన్ని అమలు చేయాలని ప్రభుత్వం భావిస్తోందనే వాదనలు వినిపిస్తున్నాయి. ఇలా చేస్తే రాష్ట్ర ప్రభుత్వానికి నెలకు రూ.116.76 కోట్లు, ఏడాదికి రూ.1,401.20 కోట్లుతో పనైపోతుంది. అసలు ఈ నగదు బదిలీ విధానం నెలనెలా సక్రమంగా అమలు అవుతుందా, లేదా అంటూ ప్రజలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. నగదు బదిలీ పథకం అమలైతే తమ పరిస్థితి ఏంటని ఎండియు డ్రైవర్లు ఆలోచనలో పడ్డారు. రాష్ట్ర ప్రభుత్వం నగదు బదిలీ విధానాన్ని ప్రారంభించకముందే ప్రజల నుంచి దీనిపై సర్వత్రా విమర్శలు, వ్యతిరేకత వెల్లువెత్తుతున్నాయి. తినడానికి అనువైన బియ్యం ఇవ్వాలని ప్రజలు కోరుతున్నారు.

# కార్మిక, కర్షక ఐక్య ఉద్యమాలే శరణ్యం

## ఎఐకెఎస్ సహాయ కార్యదర్శి విజ్జూ క్రిష్ణన్

కార్మిక, కర్షక ఐక్య ఉద్యమాలతోనే మోడీ విధానాలను ఎదుర్కో గలమని, ఇందుకు ఢిల్లీలో జరిగిన ఉద్యమమే తార్కాణమని అఖిల భారత కిసాన్ సభ సహాయ కార్యదర్శి విజ్జు క్రిష్ణన్ అన్నారు. రెండు రోజులపాటు జరిగిన ఆంధ్రప్రదేశ్ మెడికల్ అండ్ సేల్స్ రిప్రజెంటేటివ్స్ యూనియన్ 38వ మహాసభ తిరుపతిలోని గంగారాం ఫంక్షన్ హాలులో ఏప్రిల్ 16న ఘనంగా ప్రారంభమైంది. సంఘం రాష్ట్ర అధ్యక్షులు శేఖర్‌రెడ్డి జెండాను ఆవిష్కరించి మహాసభను ప్రారంభించారు. అనంతరం ఆయన అధ్యక్షతన జరిగిన మహాసభలో విజ్జు క్రిష్ణన్ ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. వ్యవసాయ నల్ల చట్టాలకు వ్యతిరేకంగా ఢిల్లీలో రైతులు చేసిన పోరాటానికి కార్మికవర్గం సహకారం అందించిందన్నారు. ఇటీవల జరిగిన కార్మికుల దేశవ్యాప్త సమ్మెలో రైతులు కూడా భాగస్వాములయ్యారని తెలిపారు. దేశవ్యాప్త సమ్మె విజయవంతమైందన్నారు. భవిష్యత్తులో కూడా కార్మిక, కర్షక ఐక్య ఉద్యమాలను ముందుకు తీసుకెళ్లేందుకు ఒకరికొకరు సహకరించు కోవాలని కోరారు. ప్రజా వ్యతిరేక విధానాలను అనుసరిస్తోన్న మోడీ ప్రభుత్వం మెడలు వంచాలంటే కార్మిక, కర్షక ఐక్య ఉద్యమాలే శరణ్యమని తెలిపారు. మహాసభలో ఆ దిశగా ఆలోచన చేయాలని సూచించారు. ఫెడరేషన్ ఆఫ్ మెడికల్ అండ్ సేల్స్ రిప్రజెంటేటివ్స్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా (ఎఫ్ఎఫ్ఆర్ఎఐ) జాతీయ అధ్యక్షులు రమేష్ సుందర్ మాట్లాడుతూ.. మందులను తయారు చేస్తోన్న యాజమాన్యాలు చాలా దుర్మార్గంగా వ్యవహరిస్తు న్నాయని అన్నారు. కోవిడ్ కాలంలో




లాభాలే ధ్యేయంగా పనిచేశాయని, మెడికల్ రిప్రజెంటేటివ్స్‌ను విస్మరించాయని విమర్శించారు. ఇటీవల జరిగిన ఎఫ్ఆర్ఎఐ జాతీయ మహాసభ మెడికల్ రిప్రజెంటేటివ్‌లకు పిఆర్‌సి, హక్కుల కోసం డిమాండ్ చేసిందని తెలిపారు. సిఐటియు రాష్ట్ర ఉపాధ్యక్షులు కందారపు మురళి మాట్లాడుతూ ఎంతోమంది మహనీయులు బలిదానం చేసి దేశానికి స్వాతంత్ర్యం తెచ్చారని, అలాంటి దేశం నేడు అంబానీ, అదానీల చేతుల్లోకి వెళ్లిపోతోందని ఆందోళన వ్యక్తం చేశారు. రాష్ట్రానికి తలమానికమైన విశాఖ ఉక్కును కేంద్ర ప్రభుత్వం అమ్మకానికి పెట్టిందని, నగదీకరణ పేరుతో రైల్వే, బిఎస్ఎన్ఎల్, నవరత్నాల్లాంటి కంపెనీలను కారుచౌకగా కార్పొరేటర్లకు కట్టబెట్టాలని చూస్తోందని తెలిపారు. ఈ దేశాన్ని బిజెపి నుంచి, కార్పొరేట్ శక్తుల నుంచి కాపాడుకోవాలన్నారు.

---

# మద్దతు ధరల చట్టం చేయాలి: రైతు సంఘాల సమన్వయ సమితి

పంట ఉత్పత్తులకు కనీస మద్దతు ధరల చట్టాన్ని చేయాలని రైతు సంఘాల సమన్వయ సమితి డిమాండ్ చేసింది. కనీస మద్దతు ధరలకు చట్టబద్ధతను డిమాండ్ చేస్తూ ఏప్రిల్ 11నుండి 17వరకు రాష్ట్రవ్యాప్తంగా నిరసనలను చేపట్టాలని రైతాంగానికి పిలుపునిచ్చింది. ఏప్రిల్ 7న రైతు సంఘాల సమన్వయ సమితి నాయకులు వై కేశవరావు అధ్యక్షతన ఆన్‌లైన్ సమావేశం జరిగింది. ఈ సమావేశంలో మర్రాపు సూర్యనారాయణ (ఏపి రైతు సంఘం), గుర్నాధరావు (కిసాన్ కాంగ్రెస్), ఆళ్ల వెంకట గోపాలకృష్ణ (సాగునీటి వినియోగదారుల సంఘం) ఎస్ ఝాన్సీ (ఏఐకెఎంకెఎస్), డి హరినాథ్ (ఏఐకెఎం), జి రంగనాథ్ (ఏఐకెకెఎస్), సిహెచ్ వెంకటేశ్వర్లు (ఏఐకెఎంసి), జె ప్రభాకర్‌రెడ్డి (ఏఐకెఎంఎస్), బాలు (ఆర్ఎస్‌వి), గిరీష్ (ఏఐకెకెఎంఎస్), కోటిరెడ్డి (రైతు సంఘాల సమాఖ్య), ఎంఎం రాజేశ్వరరావు (తెలుగురైతుసంఘం)ఎం ప్రసాద్ (జాగృతి రైతు సంఘం), యెర్నేని నాగేంద్రనాథ్ (రైతు సమాఖ్య), ఎన్ నరిసింహయ్య(ఏపి రైతుకూలీ సంఘం) తదితరులు మాట్లాడారు. కేంద్ర ప్రభుత్వం వ్యవసాయాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేస్తోందన్నారు. వ్యవసాయ రంగంలోకి కార్పొరేట్ శక్తులు ప్రవేశిస్తున్నందునే ఇప్పుడు పేద, మధ్యతరగతి రైతులకు వ్యవసాయం చేయడం దుర్లభమైందన్నారు. రైతుల ఆదాయాన్ని రెట్టింపు చేస్తానన్న ప్రధాని మోడీ




మాట ప్రకటనకే పరిమితమైందన్నారు. ఎరువులు, విత్తనాల ధరలు విపరీతంగా పెరిగిపోయాయని ఆందోళన వ్యక్తం చేశారు. వ్యవసాయ ఉత్పత్తుల కొనుగోలుకు ప్రభుత్వరంగ సంస్థలు ముందుకు రావాలని డిమాండ్ చేశారు. పంటల ధరలకు చట్టభద్ధత కల్పిస్తామని రాతపూర్వకంగా ఇచ్చిన హామీ నాలుగు నెలలు అయినా అమలుకు నోచలేదని విమర్శించారు. సంయుక్త కిసాన్ మోర్చా పిలుపులో భాగంగా రాష్ట్రంలో అన్ని జిల్లా, మండల కేంద్రాల్లో ఈ నెల 11 నుండి 17 వరకు నిరసనలు చేపట్టాలని కోరారు. ఈ కార్యక్రమాన్ని జయప్రదం చేసేందుకు పెద్దఎత్తున రైతాంగాన్ని సమీకరించాలని కోరారు.




ప్రొఫెసర్ ఎన్. వేణుగోపాలరావు
సెల్ : 9490098905

### హరిత విప్లవానంతర దశ

ఈ విప్లవాల రోండో పార్శ్వం పరిశీలించినప్పుడు, ముఖ్య విషయాలు బోధపడతాయి. హరిత విప్లవానికి మూలమైన కృత్రిమ సాంకేతిక వనరులు-విత్తనాలు, రసాయనాలు - వరవడి 90వ దశకంలో కూడా నిడిచినప్పటికీ వాటి అనుకూల ప్రభావాలు తగ్గుతూ రావడాన్ని స్వామినాథన్ వంటి నిపుణులు గుర్తించారు. దానికి కారణాలను వెతికే నేపథ్యంలో వారు మరోసారి హరిత విప్లవాన్ని విశ్లేషించారు. హరిత విప్లవ ప్రారంభ దశతో పోలిస్తే 33 సంవత్సరాల్లో ఉత్పత్తి ఉత్పాదకత తగ్గుతూ రావడం స్పష్టంగా కనపడుతూనే ఉంది.

**పంటల విస్తీర్ణం, ఉత్పత్తి, ఉత్పాదకతల రీత్యా పెరుగుదల (శాతం) :**

| కాలం | విస్తీర్ణం | ఉత్పత్తి | ఉత్పాదకత |
|---|---|---|---|
| 1967-2000 | -0.01 | 2.55 | 2.56 |
| 1980-2000 | -0.23 | 2.73 | 2.94 |
| 1990-2000 | -0.03 | 2.07 | 2.14 |
| 1986-2003 | -0.075 | 1.98 | 2.01 |

వ్యవసాయ రంగం నుండి వచ్చే జాతీయ స్థూల ఉత్పత్తి స్థాయి 1980ల్లో ఉన్న 4.2 శాతం ఉంటే, 90ల్లో 3.7 శాతానికి దిగజారడం గుర్తించాల్సిన అంశం. అదేవిధంగా పంటల దిగుబళ్ల పెరుగుదల 80ల్లో 3.4 ఉంటే అది 2.2 శాతానికి దిగిపోయింది. ఒక్క గోధుమ తప్ప మిగిలిన పంటల ఉత్పాదకత 90వ దశకంలో తగ్గుతూ రావడం ఆందోళన కలిగించే విషయం. ఇదే సందర్భంలో విస్తీర్ణ రీత్యా, ఉత్పత్తుల రీత్యా అనేక పంటల విషయంలో మొదటి 2,3 స్థానాల్లో వున్న దేశం "ఉత్పాదకత" (సగటు హెక్టారు దిగుబడి), రీత్యా ప్రపంచ దేశాల్లో 23-118 స్థానాల్లో ఉండటం కూడా గుర్తించాల్సిన విషయం.

**ఆహారధాన్య ఉత్పత్తుల ధరలు (1950-2000)**




**పంటల ఉత్పాదకత రీత్యా ముఖ్య దేశాలతో పోలిక కిలోలు/హెక్టారుకు**

| పంట | భారతదేశం | అమెరికా | చైనా | ప్రపంచదేశాల సగటు |
|---|---|---|---|---|
| వరి | 1953 (51) | - | 4241 | 2564 |
| గోధుమ | 2654 (32) | - | 4087 | 2686 |
| ఇతర గింజలు | 2232 (105) | - | 4844 | 2971 |
| అపరాలు | 587 (118) | - | 1478 | 806 |
| తిండిగింజలు | 1889 (97) | 5299 | 4735 | 2772 |
| ఆలుగడ్డ | 13003(23) | 18040 | 10149 | 16130 |
| చెరకు | 69737(34) | - | 75982 | 63324 |
| పత్తి | 922 (57) | 2537 | 3321 | 1842 |

బ్రాకెట్లలో ఉన్నవి ప్రపంచ స్థాయిలో వరుస క్రమ స్థానంగా చూడాలి

పైగా అనేక విషయాల్లో పర్యావరణ ప్రతిబంధకాలను ఎదుర్కొనే స్థితి మూలంగా వ్యవసాయ రసాయనాలు నిలవడం మరో ప్రత్యేకమైన పరిస్థితి

ప్రారంభ దశలో కేవలం 25-30 మిలియన్ టన్నుల రసాయన ఎరువులే వాడితే అ వొరవడి 1994 నాటికి 18 మిలియన్ టన్నులకు తీసుకువెళ్లిందనేది స్పష్టంగా గమనించవచ్చు. అంటే వీటి సగటు వాడకం 90-140 కిలోలు / హెక్టారుకు వెళ్లడం దరిమిలా కృత్రిమ వనరులపై పెట్టే పెట్టుబడి పెరుగుతూ వచ్చింది. ఆంధ్రప్రదేశ్, పంజాబ్, తమిళనాడు వంటి రాష్ట్రాల్లో ఎరువుల వాడకం ఎంత నిష్ప్రయోజనంగా మారిందో వరి, వేరుశనగ, పత్తి, మిర్చి వంటి పైర్ల విషయంలో గమనిస్తే తెలుస్తుంది.

ఆంధ్రప్రదేశ్ వంటి రాష్ట్రాల్లో రసాయన ఎరువుల (కిలోలు / హెక్టారుకు) వాడకం

| పైరు | వాడుతున్న మోతాదు | సిఫార్సు చేసినమోతాదు | ఎక్కువ |
|---|---|---|---|
| వరి | 237 | 160 | 48.1 |
| వేరుశగ | 142 | 120 | 18.3 |
| పత్తి | 281 | 240 | 17.0 |
| మిర్చి | 320 | 240 | 25.0 |



ఆహారధాన్యాల ఉత్పత్తితో రసాయన ఎరువుల వాడకానికున్న పోలిక




వీటివల్ల దిగజారుతూ వస్తున్న ప్రతిఫలాన్ని కూడా గమనించవచ్చు. ప్రారంభంలో (1970-75) కిలో రసాయన ఎరువుకు 15 కిలోల తిండిగింజలు పెరిగితే, 1999-2000 నాటికి కేవలం 8 కిలోలు మాత్రమే పెరిగాయి.

## రసాయన ఎరువల వాడకం వల్ల తగ్గుతూ వస్తున్న ప్రతిఫలం

| రసాయన ఎరువులు (మిలియన్ టన్నుల్లో) పెరిగిన గింజలు (కిలోలల్లో) | | | | | |
|---|---|---|---|---|---|
| కాలం | ఆహారధాన్యాలు | పెరుగుదల | మొత్తంవాడకం | పెరుగుదల | పెరిగిన గింజలు |
| 1970-75 | 103 | - | 2.6 | | |
| 1975-80 | 120 | 17 | 4.2 | 1.6 | 15.0 |
| 1980-85 | 138 | 18 | 6.8 | 2.6 | 12.5 |
| 1985-90 | 155 | 17 | 9.7 | 2.9 | 10.5 |
| 1990-95 | 180 | 25 | 12.7 | 3.0 | 10.0 |
| 1995-2000 | 190 | 10 | 17.6 | 2.9 | 8.0 |

సస్యరక్షణ రసాయనాలు కూడా 1993-94 నాటికి 82,203 టన్నుల మూల పదార్థం అవసరమైన స్థితి నెలకొందివాటి వాడకం పంజాబ్, ఆంధ్రప్రదేశ్, హర్యానా వంటి రాష్ట్రాల్లో హెక్టారుకు సగటున 750-820 గ్రాములనేది గుర్తించాల్సిన విషయం. వ్యాపార పంటలు సాగు చేస్తున్న ప్రాంతాల్లో వీటిని వాడాల్సిన అవసరం ఇంకా ఎక్కువగా వచ్చింది. పైగా వీటి వాడకం పెరిగిన రాష్ట్రాల్లో తరచుగా పురుగులు, తెగుళ్ల పెచ్చుటిల్లిపోయి పంట నష్టాలు పెరుగుతూ రావడం 1990 దశకంలో ఎక్కువ. ప్రారంభ దశతో పోలిస్తే వీటి వాడకం 4 రెట్లు పెరిగింది. ❋

# పత్తి రైతులను కాపాడండి ! : కేంద్రానికి ఎఐకెఎస్ డిమాండ్





అన్ని పత్తి దిగుమతులకు ఏప్రిల్ 14 నుండి సెప్టెంబరు 30 వరకు కస్టమ్స్ సుంకాల నుండి మినహాయింపు ఇవ్వాలనే కార్పొరేట్ జౌళి కంపెనీల కోరిక మేరకు మోడీ నేతృత్వంలోని బిజెపి ప్రభుత్వం ఏకపక్షంగా తీసుకున్న నిర్ణయాన్ని అఖిల భారత కిసాన్ సభ (ఎఐకెఎస్) ఖండించింది. ఈ మేరకు ఎఐకెఎస్ అధ్యక్షుడు అశోక్ ధావలె, ప్రధాన కార్యదర్శి హన్నన్ మొల్లాలు ఒక ప్రకటన జారీ చేశారు. భారత్‌లో పత్తి దిగుమతులపై సెస్సు, సర్‌చార్జిలు కలిపి 11శాతం దాకా విధిస్తున్నారు. భారతదేశంలో రైతులు పండించిన పత్తికి, సేకరణకు ప్రోత్సాహక ధరలు ఇస్తామని హామీ లేకుండానే ప్రభుత్వం ఈ చర్య తీసుకుందని పేర్కొంది. దీంతో చైనా బ్రెజిల్, అమెరికా, ఇతర దేశాల నుండి చవకగా పత్తి దేశంలోకి రావడానికి ఇది వీలుకల్పిస్తుందని ఎఐకెఎస్ నేతలు పేర్కొన్నారు. ఇలా దేశంలోకి వెల్లువెత్తే దిగుమతుల ప్రభావం ధరలపై పడకుండా నిలువరించేలా సమర్ధవంతమైన రీతిలో సేకరణ, ధరల స్థిరీకరణ నిధి లేకపోవడం ఇప్పటికే మన దేశంలో సంక్షోభంతో కొట్టుమిట్టాడుతున్న పత్తి రైతులపై మరింత భారం పడేందుకు దారి తీస్తుందనిహెచ్చరించారు. భారత్‌లో పత్తి ఎక్కువగా పండే ప్రాంతాల్లో రైతులు నిరాశా నిస్పృహలతో అత్యధిక సంఖ్యలో ఆత్మహత్యలు చేసుకుంటున్న విషయం మరచిపోరాదనివారు పేర్కొన్నారు.

ముడి పదార్ధాల కొరత వున్నందున జౌళి పరిశ్రమకు సాయపడేందుకు ఈ నిర్ణయం అవసరమైందని బిజెపి ప్రభుత్వం చెబుతోంది. దేశంలో ఆశించినదాని కన్నా తక్కువ మొత్తంలో దిగుబడి రావడం వల్ల, దేశీయ పత్తి ధరల్లో పెరుగుదల కారణంగా దిగుమతి సుంకాలను రద్దు చేయాల్సి వచ్చిందని ఆర్థిక శాఖ పేర్కొంటోంది. తోటి పోటీదారులతో పోలిస్తే, దేశీయ జౌళి పరిశ్రమల ఎగుమతుల పోటీతత్వంపై నెలకొను ఒత్తిడిని సడలించేందుకే ఈ చర్య అనే సాకుతో, ఇది వినియోగదారులకు కూడా ఉపశమనం కలిగిస్తుందనే అర్ధంలేని వాదనకు దారి తీస్తుంది. చవకగా ముడి పదార్ధాలు లభ్యమైతే వాటి ప్రయోజనాలను ఈ బడా కార్పొరేట్ జౌళి పరిశ్రమలు ఎనుడూ వినియోగదారులకు బదిలీ చేయవనేది అందరికీ తెలిసిన వాస్తవమే, ఎందుకంటే గరిష్ట స్థాయిలో లాభాలార్జించాలనుదే వారి ప్రధాన ధ్యేయంగా వుంటుందని ఆ ప్రకటన పేర్కొంది.

"ఇప్పటికే తీవ్ర సంక్షోభంలో వుండి, ప్రోత్సాహక ధరలను అందుకోలేకపోతున్న మన దేశంలోని పత్తి రైతులకు ఈ ప్రభుత్వం తీసుకున్న ఈ నిర్ణయం మరింత విపత్తును కలిగిస్తుంది. ఉత్పత్తి వ్యయానికి కనీసం ఒకటిన్నర రెట్లకు ప్రోత్సాహక ధరలను ఇచ్చి పంటను సేకరించే రీతిలో, పత్తి రైతాంగానికి ఎలాంటి హామీ ఇవ్వలేదు. వెల్లువలా వచ్చి పడే ముడి పత్తి వల్ల ధరలు మరింతగా పడిపోతాయి. సమర్ధవంతమైన ధరల స్థిరీకరణ నిధి లేనందువల్ల ధరలు కుప్పకూలితే దానిప్రభావం నిరుపేదలైన రైతులపైనే ఎక్కువగా పడుతుంది. ముడి సిల్క్ దిగుమతి సుంకం ఎత్తివేసినపుడు జరిగిన అనుభవం ఇదే" అని ఎఐకెఎస్ నేతలు పేర్కొన్నారు. అందువల్ల కేంద్రం తక్షణమే ఈ నిర్ణయాన్ని ఉపసంహరించుకోవాలని ఎఐకెఎస్ డిమాండ్ చేస్తోంది. పత్తిపై దిగుమతి సుంకాలను తిరిగి విధించాలనికోరుతోంది. సరైన ప్రోత్సాహక ధరలకు రైతుల ఉత్పత్తిని సేకరించేందుకు ఏర్పాట్లు చేయాలని డిమాండ్ చేస్తోంది. దిగుమతి సుంకాలను రద్దు చేయడం ద్వారా వచ్చే ఆదాయాన్ని రైతులకు రాయితీలిచ్చేందుకు ఉపయోగించాలి. ఏమాత్రమూ ఆలోచన లేనిరీతిలో కేంద్రం తీసుకును ఈ నిర్ణయానికి నిరసనగా పత్తి పండించే రాష్ట్రాల్లోని శాఖలన్నీ నిరసనలు చేపట్టాలని ఎఐకెఎస్ పిలుపిచ్చింది.




విద్యుత్ రంగంలో కేంద్రప్రభుత్వం ప్రవేశపెడు తున్న సంస్కరణలు రాష్ట్ర ప్రజలపై భారాలకు కారణమవుతున్నాయి. రాష్ట్రాలకు అదనంగా అప్పులు కావాలంటే తమ షరతులకు అంగీకరించాల్సిం దేనంటూ కేంద్రం పెడుతున్న ఆంక్షలతో ఒకవైపు చార్జీల పెంపు, మరోవైపు ప్రైవేటీకరణ వైపు అడుగులు పడుతున్నాయి. కేంద్రప్రభుత్వ విద్యుత్ రంగంలో తీసుకొస్తున్న సంస్కరణలను మిగిలిన అన్ని రాష్ట్రాలకంటె ముమదుగా ఎపి ప్రభుత్వమే ఉత్సాహంగా అమలు జరపడం గమనార్హం. పేదలకు క్రాస్ సబ్సిడీలు ఇవ్వొద్దంటూ కేంద్రం విధించిన షరతులో భాగంగా ఇటీవల విద్యుత్ టారీఫ్‌లో రాష్ట్రప్రభుత్వం మార్పులు చేసింది. గత రెండు దశాబ్దాల్లో ఎన్నడూ లేనివిధంగా 300 యూనిట్లలోపు విద్యుత్ వాడే గృహ వినియోగదార్లపై పెను భారం మోపింది. టిడిపి సర్కారు పాలనలో ప్రపంచ బ్యాంకు ఆదేశాలతో ప్రజలపై భారాలు పడితే ఇప్పుడు అవే విధానాలతో కేంద్ర ప్రభుత్వ షరతుల మూలంగా జనం నెత్తిన కరెంటు చార్జీల పిడుగులు పడుతున్నాయి. ప్రజల ప్రతిఘటన తప్పదు. నూతన టారీఫ్‌తో ఏటా రూ.1400కోట్ల చొప్పున భారాన్ని ప్రజలపై మోపింది. ఇప్పటి వరకు నెలకు 30 యూనిట్లు వినియోగించే వినియోగదారుడు రూ.43.50లు చెల్లిస్తుండగా, కొత్త టారీఫ్ ప్రకారం 31 శాతం భారంతో రూ.57లు చెల్లించాల్సి ఉంటుంది. 75 యూనిట్లు వినియోగిస్తున్న వారు ప్రస్తుతం చెల్లిస్తున్న రూ.137.50ల బిల్లుకు 40శాతం అదనంగా రూ.192లు చెల్లించాలి. నెలకు 0-30 యూనిట్లు వినియోగించే వినియోగదారులు 38,74,147 మందిపై నెలకు 5.23 కోట్లు, 31-75 లోపు 39,84,242 మందిపై నెలవారీగా 20.9 కోట్లు భారం పడింది. 76-125 లోపు 38,28,155 మంది, 126-225 లోపు 27,51,171 మంది, 226-400లోపు 5,98,427 మంది కాగా 400 యూనిట్లు పైబడిన వినియోగదారులు కేవలం 1,34,666 మంది ఉన్నారు. అంటే పెద్ద సంఖ్యలోవున్న సామాన్యులపై చార్జీలు వడ్డించి, కొద్ది మంది ధనికులకు తగ్గించారు. విద్యుత్ చార్జీలకు ట్రూఅప్ చార్జీలు రూ.2900కోట్లు అదనం.

రీవ్యాంప్డ్ డిస్ట్రిబ్యూషన్ సెక్టార్ స్కీం(ఆర్‌డిఎస్‌ఎస్) అమలు చేస్తే రుణాలు ఇస్తామని చెబుతూ ప్రజలపై భారాలు మోపాలని, విద్యుత్ సిబ్బందిని కుదించుకోవాలని రాష్ట్రాలను కేంద్రం ప్రలోభాలకు గురిచేస్తోంది. స్మార్ట్ ప్రిపెయిడ్ మీటర్లను అన్ని రంగాల విద్యుత్ వినియోగదారులకు 2023 డిసెంబర్ నాటికి బిగించాలని ఆర్‌డిఎస్‌ఎస్‌లో ప్రధాన అంశం. ఈ మీటర్లు ఒక్కొక్కటి సుమారు రూ.5 నుంచి 6వేలు ఉంటుందని అధికారులు అంచనా వేస్తున్నారు. ఈ మీటర్లకు అయ్యే ఖర్చు విద్యుత్ వినియోగదారులే భరించాల్సి వుంటుందని చెబుతున్నారు. స్మార్ట్ ప్రిపెయిడ్ మీటర్లు అమరిస్తే ఫోన్ నెట్‌వర్క్ వినియోగించకముందే బిల్లు ఎలా అయితే చెల్లిస్తున్నామో, విద్యుత్ బిల్లు కూడా అలానే ముందుగా చెల్లించాల్సి ఉంటుంది. కరెంటు వినియోగం అంతకు మించితే ఇంట్లో ఆటోమేటిక్‌గా కరెంట్ పోతుంది. మరోపక్క వ్యవసాయ పంపుసెట్లకు సర్కారు స్మార్ట్ మీటర్లను బిగిస్తోంది. ప్రస్తుతం రైతులు వాడే కరెంట్‌కు బిల్లు తామే చెల్లిస్తామని చెబుతున్నా, ప్రభుత్వం బిల్లు చెల్లించకపోతే పరిస్థితి ఎలా ఉంటుందో నని రైతులు ఆందోళన చెందుతున్నారు. భవిష్యత్తులో ఇది కూడా గ్యాస్ సబ్సిడీ పథకం లానే అవుతుందని సందేహిస్తున్నారు.

### జెన్‌కో, డిస్కంల ప్రైవేటీకరణ

ఎపి జెన్‌కో, డిస్కంలను ప్రైవేటీకరించాలని ఆర్‌డిఎస్‌ఎస్ రూపంలో కేంద్రప్రభుత్వం ఒత్తిడి తేస్తోంది. కృష్ణపట్నం ప్లాంట్‌ను లీజు పేరుతో ప్రైవేట్‌కు అప్పగించేందుకు రాష్ట్ర మంత్రిమండలి ఆమోదం తెలిపింది. సోలార్ ఎనర్జీ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా(సెకీ) ద్వారా 25 ఏళ్ల పాటు అధిక ధరతో విద్యుత్‌ను కొనుగోలు చేసేందుకు విద్యుత్ సంస్థలు ఒప్పందం చేసుకున్నాయి. సెకీ ద్వారా అందిస్తున్న విద్యుత్ పూర్తిగా ఆదానీ కంపెనీదే! రాష్ట్రప్రభుత్వాల ఆధ్వర్యంలో నడిచే థర్మల్ విద్యుత్ ప్లాంట్లకు అవసరమైన బొగ్గును సరఫరా చేయడంలో కేంద్రప్రభుత్వం పూర్తిగా వైఫల్యం చెందింది. గ్యాస్‌తో నడిచే ప్లాంట్లకు గ్యాస్ లేకపోవడంతో ఆ ప్లాంట్లు మూతపడ్డాయి. కేంద్రం నుంచి రాష్ట్రానికి అందాల్సిన బొగ్గు, గ్యాస్‌ల గురించి పోరాడాల్సిన రాష్ట్రం, షరతులకు తలొగ్గి అధిక ధరకు విద్యుత్ కొనుగోలు చేసుకోవడం ఏమిటని విద్యుత్ నిపుణులు ప్రశ్నిస్తున్నారు.

# సంక్షోభంలో చెరకు సాగు

**• 29 ఫ్యాక్టరీలకుగాను మిగిలింది ఐదే • ఉయ్యూరు సుగర్స్ పరిధిలో అత్యల్ప సాగు**

- ఎం.హరిబాబు

రాష్ట్రవ్యాప్తంగా ఒకప్పుడు 29 షుగర్ ఫ్యాక్టరీల పరిధిలో చెరకు సాగయ్యేది. ఇప్పుడు ఐదు ఫ్యాక్టరీలు మాత్రమే మిగిలాయి. కృష్ణాజిల్లాలో ఉయ్యూరు, చల్లపల్లి (లక్ష్మీపురం), హనుమాన్ జంక్షన్ షుగర్ ఫ్యాక్టరీలు ఉయ్యూరు కెసిపి నిర్వహణలో ఉంది. ఏటా ఎనిమిది వేల టన్నుల క్రషింగ్ చేసే ఈ ఫ్యాక్టరీకి సైతం తగినంత విస్తీర్ణంలో చెరకు సాగవ్వడం లేదు. చెరకు సాగు పెట్టుబడి ఖర్చులు పెరిగిపోతున్నాయి. దుక్కులు, ఎరువులు, చెరకు రవాణా తదితరాలకు భారీగా ఖర్చు చేయాల్సి వస్తోంది. 2017-18 సీజన్లో ఎకరా చెరకు మొక్కతోట సాగుకు రూ.85 వేలు పెట్టుబడికాగా, 2022-23 సీజన్లో అది రూ.1.25 లక్షలకు చేరుకుంది. కౌలు భారం దీనికి అదనం. దీంతో గిట్టుబాటు కాని పరిస్థితుల్లో రైతులు, కౌలురైతులు చెరకు సాగుపై విముఖత చూపుతున్నారు. గత ఐదేళ్లతో పోలిస్తే కృష్ణాజిల్లా ఉయ్యూరు కెసిపి షుగర్ ఫ్యాక్టరీ పరిధిలో ఈ సీజన్లో అత్యల్పంగా చెరకు సాగైంది.

ఉయ్యూరు కెసిపి షుగర్ ఫ్యాక్టరీ యాజమాన్యం టన్ను చెరకుకు రూ.2,850 రైతుకు చెల్లిస్తోంది. మొక్కతోట సాగుకు ఎకరానికి మరో రూ.20 వేలు ప్రోత్సాహం ఇస్తోంది. మొత్తం కలిపి సగటున టన్నుకు రూ.3,050 అందుతోంది. ఈ క్రషింగ్ సీజన్లో సగటున ఎకరానికి 32.4 టన్నుల దిగుబడి మాత్రమే రాగా రైతుకు ప్రోత్సాహకాలతో కలిపి రూ.98,820 మాత్రమే ఆదాయం వచ్చింది. పెట్టిన పెట్టుబడికన్నా ఎకరానికి రూ.26,180 వరకు నష్టం వాటిల్లింది. కృష్ణాజిల్లాలో కౌలు రైతులే అత్యధిక విస్తీర్ణంలో చెరకు సాగు చేస్తున్నారు.

**కృష్ణా జిల్లాలో సాగు విస్తీర్ణం వివరాలు**

| సంవత్సరం | సాగు విస్తీర్ణం | గానుగాడిన చెరకు |
|---|---|---|
| (ఎకరాల్లో) | (టన్నుల్లో) | |
| 2017-18 | 31,932.50 | 9,02,420 |
| 2018-19 | 21,626.00 | 7,05,400 |
| 2019-20 | 12,272.00 | 4,11,000 |
| 2020-21 | 13,000.00 | 4,21,200 |
| 2021-22 | 12,175.00 | (వచ్చే ఏడాది దిగుబడులు వస్తాయి) |



ఎకరానికి సగటున 15 టన్నుల చొప్పున భూ యజమానికి కౌలు చెల్లిస్తున్నారు. మిగిలిన 17.4 టన్నులకు రూ.53,070 మాత్రమే కౌలు రైతులకు ఆదాయం వచ్చింది. పెట్టిన పెట్టుబడితో పోలిస్తే ఎకరానికి రూ.71,930 అప్పు మిగులుతోంది. మొదటి ఏడాది మొక్క తోటకు పెట్టుబడి వ్యయం ఎక్కువైనా రెండో ఏడాది నామమాత్రంగానే వ్యయం అవుతుంది. పిలకను సంరక్షించుకోవడం ద్వారా కొంత మేరకు ఆదాయం తిరిగి రాబట్టుకునే అవకాశం ఉంటుంది. అయితే ఈ ప్రాంతంలో రెండేళ్లుగా ఎలుకల బెడద తీవ్రతరమైంది. ఎకరానికి రూ.10 వేలు ఖర్చు చేసినా వాటి నివారణ సాధ్యం కావడంలేదు. దీంతో పిలక తోటలను తొలగించాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఉయ్యూరు ఫ్యాక్టరీ పరిధిలోని పమిడిముక్కల మండలంలో ఏటా సగటున వెయ్యి ఎకరాలు చెరకు సాగవుతుండగా, ఈ సీజన్లో కేవలం 200 ఎకరాల్లో మాత్రమే సాగైంది. ఉయ్యూరు మండలం గండిగుంటలో ఏటా 150 ఎకరాల విస్తీర్ణంలో చెరకు సాగవుతుండగా, ఈ ఏడాది కేవలం పది ఎకరాలకు పరిమితమైంది.

### టన్నుకు రూ.ఐదు వేలు ఇవ్వాలి

స్వామినాథన్ సిఫార్సులను అనుసరించి టన్ను చెరకుకు రూ.ఐదు వేలు చెల్లించాలి. చెరకు కట్టింగ్, ట్రాన్స్‌పోర్టు ఛార్జీలు ఫ్యాక్టరీలే భరించాలి. కౌలురైతులకు రుణాలు, విత్తనాలు సబ్సిడీపై ఇవ్వాలి. కేంద్ర ప్రభుత్వం ముడి పంచదార దిగుమతుల సుంకం పెంచాలి.

**(కౌలురైతు సంఘం కృష్ణాజిల్లా కార్యదర్శి)**

# ఖరీఫ్‌కు విభజన చిక్కులు

ముంచుకొస్తున్న ఖరీఫ్‌కు జిల్లాల విభజన ఆటంకంగా తయారైంది. సీజన్ ప్రారంభమవు తుందనగా కొత్త జిల్లాలు ఉనికిలోకి రావడంతో వ్యవసాయ, అనుబంధ శాఖల పాలన గందరగోళంగా మారింది. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ ప్రధాన రాష్ట్రం కాగా 60-70 శాతం పంటల సాగు వానాకాలంలోనే జరుగుతుంది. సరిగ్గా ఇప్పుడే కొత్త జిల్లాలు, కొత్త రెవెన్యూ డివిజన్లు రావడంతో వ్యవసాయ శాఖలో యుద్ధప్రాతిపదికన అధికారుల నియామకం చేపట్టాల్సి వచ్చింది. సుదీర్ఘకాలం కమిషనర్‌గా పని చేసిన హెచ్ అరుణ్ కుమార్ బదిలీ అయ్యారు. ఆ స్థానం లోకి సిహెచ్ హరికిరణ్ వచ్చారు. వ్యవసాయ శాఖలో అసిస్టెంట్ డైరెక్టర్, డిప్యూటి డైరెక్టర్, జాయింట్ డైరెక్టర్ పదోన్నతులు జరిగి చాలా కాల మైంది. కొత్త జిల్లాలు, రెవెన్యూ డివిజన్లకు అధికారుల నియామకం ఇబ్బందికరంగా మారింది. గతంలో జిల్లా వ్యవసాయాధికారిగా జెడిఎలను వేయగా, జిల్లాల విభజన తర్వాత తెలంగాణ తరహాలో డిడిలను డిస్ట్రిక్టు అగ్రికల్చర్ ఆఫీసర్ (డిఎఒ) పేరిట వేశారు. కొన్నిచోట్ల జెడిఎలనే డిఎఒలుగా కొనసాగించారు. కొత్తగా ఏర్పాటైన 24 రెవెన్యూ డివిజన్లకు డిడిలను నియమించలేదు. పక్క డివిజన్ అధికారులను తాత్కాలిక ఇన్‌ఛార్జీలుగా వేశారు. కొత్త సర్వీస్ ఏరియాలు కావడం, తక్షణం ఖరీఫ్ ఏర్పాట్లు చేయాల్సి రావడంతో అయోమయం నెలకొంది.



### విత్తనాలు, ఎరువులే కీలకం

తొలకరి వానలు సకాలంలో కురిస్తే జూన్ నుండి సీజన్ మొదలవుతుంది. ఉత్తరాంధ్రలో మే మూడవ వారంలోనే ముందస్తు పంటలు వేస్తారు. తక్షణం విత్తన ప్రణాళిక అమలు చేయాలి. రాయితీ విత్తనాల ను సేకరించాలి. సబ్సిడీ లేని సీడ్స్‌ను సైతం అందు బాటులో ఉంచాలి. దాదాపు ఏడెనిమిది లక్షల క్వింటాళ్ల సబ్సిడీ విత్తనం సేకరించాలి. రాయల సీమకు వేరుశనగే 60 శాతం పైన ఉంటుంది. సేకరణ ఆలస్యమైతే నాసిరకం వచ్చే ప్రమాదం ఉంది. రైతు భరోసా కేంద్రాల (ఆర్‌బికె)లో ముందస్తు రిజిస్ట్రేషన్ వంటి తంతు ఉన్నదే. మే మూడవ వారం నుండి వేరుశనగ విత్తనం పంపిణీ ప్రారంభం కావాలి. గతంలో ప్రతి జిల్లాకూ ఎపి సీడ్స్ మేనేజర్లు ఉండేవారు. జిల్లాల విభజనతో చాలా జిల్లాలకు మేనేజర్లు లేరు. ఎరువుల సేకరణ సకాలంలో జరగాలి. ఆర్‌బికెలు, పిఎసిఎస్‌లు, డిసిఎంఎస్‌లకు మార్క్‌ఫెడ్ నుండి ఎరువులు అందాలి. కొత్త జిల్లాలకు మార్క్‌ఫెడ్ అధికారులు లేరు. ఎరువుల మూమెంట్ పై పర్యవేక్షణ వారిదే. పరపతి వ్యవస్థ సైతం ఇబ్బందుల్లోనే ఉంది. కొత్త జిల్లాలకు లీడ్ బ్యాంక్ మేనేజర్లు రావాల్సి ఉంది. కలెక్టర్లు రుణ ప్రణాళికను ఖరారు చేయాలి. సహకార రంగంలోని జిల్లా కేంద్ర సహకార బ్యాంకుల (డిసిసిబి) సర్వీస్ ఏరియా, పాలనకు రిజర్వ్ బ్యాంక్ అనుమతి లేనందున పాత పద్ధతిలోనే కొనసాగుతు న్నాయి. దాంతో సహకార పరపతి వ్యవహారం గందరగోళంగా మారింది. ఇదే సమయంలో మేలో రైతులకు రైతు భరోసా సాయం, గత ఖరీఫ్ పంట నష్టాలకు ఇన్సూరెన్స్, పంట రుణాలపై సున్నా వడ్డీ క్లెయిము చెల్లింపులకు ఇబ్బందులేర్పడ్డాయి. సాగు సాగించలేక ఆత్మహత్యలు చేసుకున్న రైతు కుటుంబాలకు పరిహారం ఇచ్చే విష యంలోనూ సమస్యలొస్తున్నాయని చెబుతున్నారు.

# వ్యవసాయ మంత్రి ప్రకటనపై ఎస్‌కెఎం ఆశ్చర్యం

కనీస మద్దతు ధరల కమిటీ ఏర్పాటు కోసం ప్రభుత్వం సంయుక్త కిసాన్ మోర్చా (ఎస్‌కెఎం) నుంచి పేర్ల కోసం ఎదురు చూస్తోందని కేంద్ర వ్యవసాయ శాఖ మంత్రి నరేంద్ర తోమర్ చేసిన ప్రకటనపై సంయుక్త కిసాన్ మోర్చా (ఎస్ కెఎం) ఆశ్చర్యం వ్యక్తం చేసింది. ప్రభుత్వం తమ లేఖను మూడు వారాలుగా చదవలేదని విమర్శించింది. ఈ మేరకు ఏప్రిల్ 14న ఎస్ కెఎం నేతలు దర్శన్ పాల్, హన్నన్ మొల్లా, జగ్జిత్ సింగ్ దల్లేవాల్, జోగిందర్ సింగ్ ఉగ్రహన్, శివకుమార్ శర్మ (కాక్కా జీ), యుధ్వీర్ సింగ్, యోగేంద్ర యాదవ్ సంయుక్తంగా ప్రకటన విడుదల చేశారు. ఎంఎస్ పిపై ప్రతిపాదిత కమిటీకి సంబంధించి ఎస్ కెఎం లేవనెత్తిన ప్రశ్నలకు సమాధానం ఇవ్వకుండా ప్రభుత్వం ఉందని విమర్శించారు. ఈ కమిటీలో ఎవరెవరు ఉంటారు? ఏమి చేస్తారు? ఎలా పని చేస్తారో? స్పష్టంగా తెలిసే వరకు కమిటీకి పేర్లు ఇవ్వడానికి ఎస్‌కెఎం నిరాకరించిందని తెలిపారు. ఎంఎస్‌పిపై కమిటీ ఏర్పాటు కోసం ప్రభుత్వం ఎస్‌కెఎం పేర్ల కోసం ఎదురు



చూస్తోందని కేంద్ర వ్యవసాయ శాఖ మంత్రి నరేంద్ర తోమర్ చేసిన ప్రకటనపై సంయుక్త కిసాన్ మోర్చా ఆశ్చర్యం వ్యక్తం చేసిందని అన్నారు. కేంద్ర ప్రభుత్వం అడిగినప్పుడు, సంయుక్త కిసాన్ మోర్చా మార్చి 24న తన సమాధానాన్ని పంపిందని, అది మార్చి 30న మళ్లీ పంపబడిందని అన్నారు. ఈ విషయంపై మోర్చా ఏప్రిల్ 1న పత్రికా ప్రకటన విడుదల చేసిందని, ఇది మీడియాలో కూడా చాలా చర్చనీయాంశమైందని పేర్కొన్నారు. *

# కేరళలో నేను చూసిన వ్యవసాయం

- కె.శ్రీనివాస్, ఎపి రైతు సంఘం సహాయ కార్యదర్శి

కేరళ రాష్ట్రంలోని పలు ప్రాంతాలను నేను ఏప్రిల్ 5 నుండి 10 వరకు సందర్శించాను. సిపిఎం అఖిల భారత 23 వ మహాసభలు ముగింపు సందర్భంగా జరిగే బహిరంగ సభలో పాల్గొనడానికి వెళ్లాను. నేను కేరళ రాష్ట్రం వెళ్లడం ఇదే మొదటిసారి. కేరళ రాష్ట్రం గురించి, అక్కడి వ్యవసాయం గురించి పత్రికలలో, పుస్తకాలలో కొన్ని అంశాలు చదివాను. అయితే స్వయంగా చూడడం ద్వారా మరింతగా అర్థం చేసుకోవడానికి అవకాశం ఏర్పడింది. ఎన్నో భిన్నమైన పంటలకు అది చిరునామా. కేరళ ఒక అందమైన రాష్ట్రం, పర్యాటక ప్రాంతమే కాకుండా అది ఒక వ్యవసాయ క్షేత్రం. వివిధ పంటల అభివృద్ధికి నమూనాగా కూడా నాకు కేరళ కనిపించింది. రైతు ఆత్మహత్యలు లేని రాష్ట్రం అది. రైల్లో తమిళనాడు రాష్ట్రం దాటగానే పాలక్కాడ్ జిల్లా ప్రారంభమైంది. వర్షంతో కేరళ రాష్ట్రం మాకు స్వాగతం పలికింది. పాలక్కాడ్ జిల్లాలో వరి కోతలు జరుగుతున్నాయి. అనేక చోట్ల ధాన్యం రాశులుగా ఉన్నాయి. ఎర్నాకులం వరకు వరి పంట కనిపించింది. పాలక్కాడ్, త్రిసూర్, ఎర్నాకులం, అలపూజ, కొల్లం, కోజికోడ్, కన్నూర్ తదితర జిల్లాలలో అత్యధికంగా కొబ్బరి పంట ఉంది. ఆతరువాత ఎక్కువగా అరటి సాగు ఉంది. వయనాడ్ ప్రాంతంలో వక్క మిరియాలు, కాఫీ తోటలు కనిపించాయి. ఎక్కడ చూసినా పచ్చదనం.. అందమైన ఇళ్లు. వాటి చుట్టూ కొబ్బరి, అరటి తదితర చెట్లు.. అందమైన పూల మొక్కలు కనిపించాయి. కేరళ అనేక అంశాలలో ముందున్నది. అందుకేనేమో అంతర్జాతీయ సంస్థల నుండి అనేక ప్రశంసలు కేరళ వామపక్ష ప్రభుత్వానికి రావడానికి కారణం అని గమనించాను.

### వరి సాగుకు ప్రాధాన్యత

ఏప్రిల్ 9,10 తేదీల్లో కన్నూర్ వెళ్ళాము. సిపిఎం అఖిలభారత మహాసభల సందర్భంగా ఏర్పాటు చేసిన ఎగ్జిబిషన్ చూశాను. ఎగ్జిబిషన్ గ్రౌండ్‌లో ఒక వ్యవసాయ క్షేత్రాన్ని ఏర్పాటు చేశారు. అందులో ఒక ఇల్లు, దాని చుట్టూ అనేక పండ్ల చెట్లు, పూల మొక్కలు, పంట కాలువలు, వరి పంట పొలాలు ఏర్పాటు చేశారు. వరి పంటకు అత్యధిక ప్రాధాన్యం ఇస్తున్నట్లుగా కనిపించింది. ఆ రాష్ట్రం అంతా కొండలు, అటవీ ప్రాంతం, సముద్రతీరం ప్రాంతంగా ఎక్కువగా ఉన్నట్లుగా గమనించాను. వరి పండించడానికి తగిన భూములు అక్కడ అందుబాటులో లేవు. సుగంధ ద్రవ్యాలు, ఇతర వాణిజ్య పంటలకు అనువైన భూములుగా ఉన్నాయి. ఇలాంటి భూములను వరి పండించే భూములుగా మార్చడం కష్టమే. అయితే మన రాష్ట్రంలో వరి పండే భూములను ఆక్వా చెరువులుగా ఇతర వాణిజ్య పంటలు పండే భూములుగా మారుస్తున్నారు. మన ప్రభుత్వం వరికి ప్రాధాన్యతను రోజు రోజుకీ తగ్గించి వేస్తోంది. ఫలితంగా మన వరి రైతులు పండించిన పంటను అమ్ముకోవడానికి ఇబ్బందులు పడుతున్నారు. అయితే కేరళ వామపక్ష ప్రభుత్వం వరి పంటకు అధిక ప్రాధాన్యత ఇస్తూ కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన మద్దతు ధరకు అదనంగా దాదాపు రూ.వెయ్యి రైతుకు ఇచ్చి కొనుగోలు చేస్తోంది.



### ఆదర్శవంతమైన సహకార వ్యవస్థ

కేరళ రాష్ట్రంలో దేశంలోనే అత్యంత ఆదర్శవంతమైన సహకార వ్యవస్థ నడుస్తున్నట్లుగా గమనించాను. మన రాష్ట్రంలో సహకార సంఘాలను పరిశీలిస్తే వ్యాపార దృక్పథం మనకు కనిపిస్తుంది. అయితే అక్కడ సహకార వ్యవస్థ అట్లా లేదు. మేము కోజికోడ్ బీచ్ సమీపంలో కేరళ స్టేట్ కాఫీ సహకార సొసైటీ హోటల్లోకి వెళ్ళాము. బయట హోటళ్ళలో ధరలూ, అక్కడి హోటళ్లలో ధరలూ పరిశీలిస్తే సహకార సొసైటీ హోటల్లో చాలా తక్కువగా కనిపించాయి. అక్కడ పండే పంటలను సహకార సంఘాల ద్వారా మార్కెటింగ్ చేస్తున్నారు. వివిధ పంటలను వివిధ రకాల ఆహార ఉత్పత్తులుగా మార్చి మార్కెటింగ్ చేయడం ద్వారా సహకార సంఘాల వ్యవస్థ బలోపేతంగా ఉంది. రైతులకు మేలు జరుగుతున్నది.

### పర్యావరణ పరిరక్షణకు కృషి

అక్కడ పర్యావరణం పరిరక్షణకు ఎంత ప్రాధాన్యం ఇస్తున్నారో అర్థమైంది. భోజనాలు కూడా అరిటాకులలోనే పెడుతున్నారు. కిరణా షాప్‌లోకి వెళ్లి కొన్ని అవసరమైన సరుకులు కొనుగోలు చేశాను. కాగితం కవర్‌లో పెట్టి ఇచ్చారు. నేను ప్లాస్టిక్ కవర్ అడిగాను. ఇప్పుడు ప్లాస్టిక్ కవర్లు నిషేధం అని షాపు యజమాని చెప్పారు. ప్లాస్టిక్ కవర్లు, సంచులు లేవు.

కేరళ రాష్ట్రం సందర్శన ద్వారా మన రాష్ట్ర అభివృద్ధి నమూనాకి అక్కడ అభివృద్ధి నమూనాకు పొంతన లేదని నాకు అర్థమైంది. ఇక్కడ కాగితాలపై అభివృద్ధి ఉంటుంది. అక్కడ ప్రత్యక్షంగా కళ్లకు కనిపించే అభివృద్ధి ఉంది. అక్కడి వామపక్ష ప్రభుత్వం ప్రణాళికా బద్ధంగా వ్యవసాయ రంగ అభివృద్ధికి అనేక చర్యలు తీసుకుంటోంది. అందుకే రైతు ఆత్మహత్యలు లేని రాష్ట్రంగా కేరళ ఉంది. అభివృద్ధికి నమూనాగా కేరళ ఆదర్శంగా ఉందని నాకు అనిపించింది ఇవే పర్యటనలో నేను గమనించిన కొన్ని అంశాలు..

# మ్యుటేషన్‌కు ముందే సర్వే సబ్ డివిజన్ తప్పనిసరి



భూయాజమాన్య హక్కులకు సంబంధించి మ్యుటేషన్ చేసుకోవాలంటే అంతకంటే ముందు ఆయా భూములకు సంబంధించిన సర్వే సబ్ డివిజన్ ప్రక్రియ పూర్తి చేయాలనే నిబంధనను ప్రభుత్వం తప్పనిసరి చేసింది. ఇందుకు సంబంధించిన భూముల మ్యాపింగ్, రెవెన్యూ రికార్డు (వెబ్‌ల్యాండ్)లో నమోదు చేయించుకోవాలని ప్రభుత్వం సూచిస్తోంది. సర్వే సబ్ డివిజన్ ప్రకియ, రికార్డుల్లో పేర్లు, సర్వే నెంబర్ల ప్రక్రియ పూర్తయిన అనంతరం తహశీల్దారు మ్యుటేషన్ ప్రక్రియను ప్రారంభించాలని ఆయా జిల్లా కలెక్టర్లకు ప్రభుత్వం మార్గదర్శనం చేసింది. ప్రస్తుతం మ్యుటేషన్ కోసం వచ్చే దరఖాస్తుల్లో 45 శాతానికి పైగా వివిధ కారణాలతో తిరస్కరించబడుతున్నాయని, మ్యుటేషన్‌ను సులభతరం చేసేందుకే సర్వే సబ్ డివిజన్‌ను తప్పనిసరి చేస్తున్నట్లు ప్రభుత్వం పేర్కొంటోంది. అంతేకాకుండా మ్యుటేషన్ కోసం భూ యజమానులు చేసుకున్న దరఖాస్తును చిన్నచిన్న కారణాలతో తిరస్కరించకుండా ఏయే డాక్యుమెంట్లు లేని కారణాలతో తిరస్కరించాల్సి వచ్చిందో సరైన కారణాలను చూపడంతోపాటు ఏయే డాక్యుమెంట్లు జతపరచాలో భూ యజమానికి స్పష్టంగా తెలియజేయాల్సి ఉంటుంది. వారసత్వ ఆధారంగా మ్యుటేషన్ కోరిన కుటుంబ సభ్యులను ఫ్యామిలీ సర్టిఫికెట్ ఇవ్వాల్సిన బాధ్యత తహశీల్దారుదే కావడంతో ఆ సర్టిఫికెట్‌ను కూడా మ్యుటేషన్ సందర్భంలోనే ఇవ్వాల్సి ఉంటుందని పేర్కొన్నారు. ఇదే సందర్భంలో భూ యజమానికి సంబంధించి కుటుంబ సభ్యుల ధ్రువీకరణ పత్రాన్ని అందించినట్లయితే తదుపరి విచారణ చేయాల్సిన అవసరం లేదని ప్రభుత్వం పేర్కొంటోంది. మ్యుటేషన్ సమయంలోనే భూ యజమానికి సంబంధించి పాస్‌బుక్ కోసం దరఖాస్తు స్వీకరించాలని ఏకకాలంలో ఈ ప్రక్రియ పూర్తికావాలని మార్గదర్శకాల్లో స్పష్టంగా పేర్కొంది. చుక్కల భూములు (డాటెడ్ ల్యాండ్స్) విషయంలో భూములు చట్టం వచ్చేనాటికి 12 సంవత్సరాలు అంతకంటే ఎక్కువ కాలం వారి స్వాధీనంలో వున్నట్లు రెవెన్యూ రికార్డుల్లో ఉన్నట్టయితే ఆయా భూములను డాటెడ్ ల్యాండ్స్ యాక్ట్ -2017 ప్రకారం మ్యుటేషన్ చేసుకునే అవకాశం ప్రభుత్వం కల్పించింది.

### కోర్టు తీర్పు ఇచ్చిన కేసుల్లో సత్వరమే మ్యుటేషన్

కోర్టు తీర్పులు వెలువడిన కేసుల్లోనూ, కోర్టు ద్వారా వేలంపాట నిర్వహించిన ఆస్తులను కొనుగోలు చేసిన యజమానులకు సత్వరమే టైటిల్ హెూల్డింగ్‌ను మంజూరు చేయాలని ప్రభుత్వం కలెక్టర్లకు స్పష్టం చేసింది. మ్యుటేషన్‌కు అసైన్డ్ భూముల యజమానులు మాత్రమే దరకాస్తు చేయాల్సి ఉంటుంద,ఇ, ఇందులో థర్డ్‌పార్టీ దరకాస్తు చేసుకునే వీలుండదని స్పష్టం చేశారు.

### జెసిల ఆధీనంలో ప్రభుత్వ భూముల మ్యుటేషన్

ప్రభుత్వ భూములు, ఇతరులకు కేటాయించిన భూముల విషయంలో ముఖ్యంగా అసైన్డ్ భూముల విషయంలో భూ యజమానికి సంబంధించి మ్యుటేషన్ కల్పించేందుకు ఇప్పటి వరకు తహశీల్దారు లాగిన్‌లో పర్యవేక్షణ ఉండేది. ఆథరైజ్‌గా తహశీల్దారు డిజిటల్ సంతకం చేసే అధికారం ఉండేది. గత నాలుగు నెలలుగా ఈ ఆప్షన్‌ను ప్రభుత్వం నిలిపివేసింది. తాజాగా మ్యుటేషన్‌పై ఆథరైజ్డ్ డిజిటల్ సంతకం తహశీల్దారు స్థానంలో జిల్లా జాయింట్ కలెక్టర్లకు ప్రభుత్వం కల్పించింది. ఇందుకు సంబంధించిన జిఓ రానుంది. *

# వ్యవసాయ విద్యుత్‌కు ప్రత్యేక డిస్కం : మంత్రి పెద్దిరెడ్డి

వ్యవసాయ విద్యుత్ సరఫరాకు ప్రత్యేకంగా వ్యవసాయ పంపిణీ సంస్థను (డిస్కం) ఏర్పాటు చేయనున్నట్లు ఇంధన, అటవీశాఖ మంత్రి పెద్దిరెడ్డి రామచంద్రారెడ్డి తెలిపారు. రాష్ట్రంలోని 18 లక్షల మంది రైతులకు ప్రత్యేక వ్యవసాయ డిస్కం ద్వారా నాణ్యమైన విద్యుత్‌ను అందించాలని సిఎం వైఎస్ జగన్మోహన్‌రెడ్డి భావిస్తున్నట్లు చెప్పారు. సచివాలయంలోని తన చాంబర్‌లో ఎపి పవర్ కో ఆర్డినేషన్ కమిటీ (ఎపిపిసిసి), ఎపి సదరన్, ఈస్టర్న్, సెంట్రల్ డిస్కంల సిఎమ్‌డిలతో మంత్రి పెద్దిరెడ్డి ఏప్రిల్ 19న సమీక్షా సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ, వ్యవసాయ అవసరాలను దృష్టిలో ఉంచుకుని సోలార్ ఎనర్జీ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (సెకీ) ద్వారా ఏడు వేల మెగా వాట్ల సౌర విద్యుత్‌ను సమీకరించేందుకు చర్యలు తీసుకుంటున్నట్లు తెలిపారు. రాష్ట్రంలోని రైతులకు అండగా నిలవాలని జగన్ లక్ష్యంగా పెట్టుకున్నారన్నారు. ప్రస్తుత డిస్కమ్‌లపై ఆర్థికంగా అదనపు భారం లేకుండా రాబోయే 25 ఏళ్లపాటు వ్యవసాయానికి పగటిపూట తొమ్మిది గంటల ఉచిత విద్యుత్‌ను అందించాలనే ముందుచూపుతో ప్రభుత్వం ఈ చర్యలు తీసుకుంటోందని తెలిపారు. డిస్కంల పరిధిలో విద్యుత్ నష్టాలు దుబారాను నియంత్రించేందుకు, విద్యుత్ చౌర్యాన్ని అరికట్టేందుక కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవాలని ఆదేశించారు. బొగ్గు సరఫరాల కొరత కారణంగా థర్మల్ కేంద్రాలు పూర్తిస్థాయిలో విద్యుత్‌ను ఉత్పత్తి చేయలేకపోతున్నట్లు తెలిపారు. వ్యవసాయానికి పగటి పూ ఏడు గంటలు, గృహ విద్యుత్ సరఫరాకు ఢోకా లేకుండా విద్యు చర్యలు తీసుకోవాలన్నారు. *




# జుకిని తోటల పెంపకం




సంగిరెడ్డి హనుమంత రెడ్డి
సెల్ : 94 90 20 45 45


జుకిని గుమ్మడి, పొట్ల, దోస వృక్షజాతులకు చెందిన చప్పటి కూరగాయ మొక్క. జుకినిని మామూలుగా కూరగాయగా పరిగణించినా వృక్షశాస్త్రం ప్రకారం ఇది పండు. జుకిని కాయలు మెత్తగా, స్తూపం ఆకారంలో, ముదురు ఆకుపచ్చ రంగులో ఉంటాయి. జుకిని లేదా కూర్జెట్ అన్న ఆంగ్ల పదాలు లాటిన్ భాష నుండి వచ్చాయి. జుకిని లాటిన్ మూలం గల ఇటలి పదం. ఫ్రెంచ్ భాషలలోనూ ఇదే పదాన్ని వాడతారు. అమెరికా, ఆస్ట్రేలియా, కెనడా, న్యూజీలాండ్‌లలో కూడా దీన్ని ఆంగ్లంలో జుకిని అనే అంటారు. ఈ కాయకు తెలుగు పేరు లేదు. తెలుగులోనూ జుకిని అనే అంటారు. కాయ, కాయలు అనగా ఏక బహు వచనాలకు ఒకే పదం జుకిని అనే వాడతారు.

**జుకిని చరిత్ర :** జుకిని మొక్కలను 7,000 ఏళ్ల క్రితం ఉత్తర అమెరికాకు దక్షిణ దేశం మెసోఅమెరికాలో పెంచేవారు. 19వ శతాబ్దంలో ఇటలీకి ఉత్తర వైపు నగరం మిలన్‌లో పెంచారు. అమెరికాలో జుకినిని 1920 నుండి పండిస్తున్నారు. ఇటలీలో 1901 నుండే ఈ పంట మొదలయింది. జుకిని పండ్లు నిండు కండతో కొంచెం గట్టి తొక్కతో బెరి పండ్ల లాగా ఉంటాయి. ఇవి వేసవిలో పచ్చిగానే తినే కాయలు. దీనికి గట్టి కాండము ఉండదు. బోలు గుల్ల కాండం కలిగిన మొక్క. విత్తనాలు, తొక్క ముదరక ముందే తినడానికి మెత్తగా ఉన్నపుడే ఈ కాయల్లను కోసి తింటారు. ఇది కీర దోసకాయలను పోలి ఉంటుంది. కాయ లోపల గుజ్జు మెత్తగా వుంటుంది. సాధారణంగా ఇది లేత నుండి ముదురు ఆకుపచ్చ రంగులో ఉంటుంది. బంగారు రంగు జుకినీలు పసుపుపచ్చ, లేదా నారింజరంగులో ఉంటాయి. పూర్తి పరిపక్వ దశకు చేరిన కాయలు 3 అడుగులు పైగా పొడవు ఉంటాయి. అయితే తినడానికి వీలుగా ఈ కాయలను 6 నుండి 10 అంగుళాల పొడవు కాగానే కోస్తారు. దోసకాయల లాగే కొన్ని జుకిని కాయలలో చేదు ఉంటుంది. పశువుల నుండి ఆత్మరక్షణకు కొన్ని కాయలకు చేదు సహజంగా వస్తుంది. రైతులు పండించే జుకిని కాయలలో చేదు ఉండదు. తినడానికి ఇబ్బంది లేదు. వేడి వాతావరణం, సరిగ్గా నీళ్ళు కట్టకపోవడం వలన జుకిని కాయలకు చేదు వచ్చే అవకాశం ఉంది. రైతులు విత్తనాలు కొనేటప్పుడే జాగ్రత్త తీసుకోవాలి. గట్టి పరిసరాలలో పెరగడం, పరపరాగ సంపర్కం ఈ చేదుకు కారణాలు. దక్షిణ ఆఫ్రికాలో వేలు పరిమాణంలోనే ఈ కాయలను కోసి తింటారు, కూరలలో వాడుకుంటారు. అక్కడ ఈ కాయను బేబి మ్యారొ అంటారు.

**పువ్వులు :** జుకిని పూలు ఆడ, మగ రెండూ ఉంటాయి. స్త్రీ పుష్పం మొగ్గ బంగారు రంగులో ఉంటుంది. దీని నుండి జుకిని పిందెలు పుడతాయి. పురుష పుష్పం మొక్క కాండానికి పూస్తుంది. ఆడ పూల కంటే మగ పూలు ఎక్కువగా ఉంటాయి. పరాగ సంపర్కం కోసం కొన్ని మగ పూలను ఉంచి మిగిలిన మగ పూలను కోసేయాలి. మగ పువ్వు కాండం స్త్రీ పుష్పం కంటే కొంచెం చిన్నది. రెండు పువ్వులు తినటానికి పనికి వస్తాయి. వీటిని ఆహార పదార్థాలలో, వండిన జుకిని పండ్ల అలంకరణకు ఉపయోగిస్తారు. గట్టిపడిన తాజా మొగ్గలను ఉడకబెట్టి తింటారు. స్త్రీ పువ్వు నుండి అండ కోశాలను, పురుష పుష్పం నుండి కేసరాలను తీసి తింటారు. పువ్వులను వేయించి, పెనం మీద కాల్చి చారు, పులుసులలో కలుపుకొని తింటారు.

**జుకిని సాగు :** సారవంతమైన గరుగు, ఇసుక బంక మట్టి కలిసిన పొలాలు జుకిని పంటకు మంచివి. జుకిని మొక్కలను సాధారణ వర్షపాత ప్రాంతాలలో పెంచవచ్చు. గుమ్మడి, పుచ్చ, దోస కాయలలాగే ఇవి కూడా తడిగల మైదానాలు, ఏటవాలు పొలాలు, కొండలలో కూడా బాగా పండుతాయి. పెరటి తోటల్లో, ఇళ్ల మధ్య ఎత్తు దిబ్బలపై కూడా జుకిని చెట్లను పెంచవచ్చు. జుకిని పంట వేసే ముందే రోజుకు



చారల జుకిని కాయ



సాదా జుకిని కాయ

కనీసం 8 గంటల ఎండతో 65-70 డిగ్రీల ఫారిన్ హీట్ ఉష్ణోగ్రత గల సారవంతమైన భూమిని సేద్యంచేసి, ఎరువులు పెట్టి సిద్దంగా ఉంచుకోవాలి. అవసరమైతే పందిర్లు వేయాలి. జుకిని పొదలు, తీగలు రెండు రకాలలో ఉంటుంది. మన భూమికి అనుకూలమైన జుకిని రకాన్ని ఎన్నుకోవాలి. చలికాలం తప్ప వసంత కాలం నుండి మధ్య వేసవి వరకు ఎప్పుడయినా ఈ పంట వేసుకోవచ్చు. ఒక పంట వేసవికి ముందు వచ్చేటట్లు, రెండవది వేసవి తర్వాత వచ్చేటట్లు ఏడాదికి రెండు జుకిని పంటలు వేసుకోవచ్చు. విత్తనాలు విత్తి కాని, మొలకలు నాటి కాని ఈ పంట వేయవచ్చు. విత్తనాలు తొందరగా మొలకెత్తి పెరుగుతాయి. ఏ కారణంతోనైనా విత్తనం ఆలస్యమైతే, మొలకలు నాటితే సమయం కలిసొస్తుంది. 2, 3అడుగుల దూరంలో ఒక చోట 2, 3 విత్తనాలు నాటాలి. కొండ ప్రాంతాల్లో 4 అడుగుల దూరంతో 4, 5 విత్తనాలను నాటాలి. నాటడానికి 24 గంటలు ముందు విత్తనాలను తడిపి ఉంచితే మొలకెత్తే శక్తి పెరిగి తొందరగా విత్తనాలు మొలకెత్తుతాయి. కాని తడపడం తప్పనిసరి కాదు. విత్తనాలను అంగుళం లోతులో నాటాలి. సాలు సాలుకు మధ్య 2, 3 అడుగుల దూరం ఉండాలి. ఎకరానికి 5,000 విత్తనాలు పడతాయి. మొక్కమొక్కకు సాలుసాలుకు మధ్య దూరాన్ని బట్టి ఎకరానికి 3,000 నుండి 4,500 జుకిని మొక్కలు నాటవచ్చు. మొక్కలు 2, 3 అంగుళాలు పెరగగానే మైదాన ప్రాంతాలలో బలంగా ఉన్న ఒక మొక్కను ఉంచి తతిమ్మా వాటిని కత్తిరించాలి. కొండ ప్రాతాల్లో 2, 3 మొక్కలను వుంచవచ్చు. మొక్కలు 4, 5 అంగుళాల ఎత్తు పెరగగానే వాటి మధ్య దూరం 6, 8 అంగుళాలు ఉండాలి. నెల మొక్కలు కాగానే



నెదర్లాండ్స్ బంగారు రంగు జుకినీలు

ఎరువు వేయాలి. తర్వాత 3 వారాలకొకసారి ఎరువు చల్లాలి. భూమి పైభాగ ఎండగానే మొక్కలకు నీరు పెట్టాలి. లేదా వారానికి ఒకసారి ఒక అంగుళం తడపాలి. కాలువల ద్వారా గాని, బిందు పద్ధతిలో గాని నీరు పెట్టవచ్చు. నీటి వసతి గల తోటలలో జుకిని మంచి దిగుబడి ఇస్తుంది. గడ్డిపడగానే కలుపు తీయాలి. కొన్ని మొక్కలు లోతు తక్కువ వేర్లతో తొందరగా కాపుకు వస్తాయి. ఎక్కువగా కాపు కాస్తాయి. జుకిని 7 నుండి 14 రోజుల్లో పూలు పూస్తాయి. ఫలదీకరణ చెందిన పూలు రోజూ పెరుగుతూ మెరుస్తూ ఉంటాయి. ఫలదీకరణ చెందనివి వాడి ముడుచుకుపోతాయి. పూలు పూసిన తర్వాత 4 నుండి 8 రోజుల్లో కాయలు కాస్తాయి. రోజూ తోటలో తిరిగి కాయలు ముదరకముందే, సాధారణంగా 2 అంగుళాల వ్యాసం 6, 8 అంగుళాల పొడవున్నపుడు కోయాలి. పాటిపాన్ రకం జుకిని కాయలను 3, 4 అంగుళాల వ్యాసం పెరిగినపుడు కోస్తారు. కాయలను ఎక్కువ ముదిరినంత వరకు ఉంచితే మొక్కల నుండి కొత్తకాయలు కాయవు. జుకిని 35, 55 రోజుల పంట. మొక్కకు 4, 5 కిలోల కాయలు కాస్తాయి. చాలా నెలల పాటు కాస్తూనే ఉంటాయి. కాయలను జాగ్రత్తగా పదునైన చాకుతో లేదా కత్తెరతోకోయాలి. కాయల మొదలు పట్టుకొని జాగ్రత్తగా మెలిపెడితే కూడా కాయలు ఊడతాయి. కోసేటపుడు గ్లోవ్స్ ధరిస్తే మంచిది. కోసిన కాయలను జాగ్రత్తగా రవాణాచేయాలి. వీలున్నంత తొందరగా వాడాలి. జుకిని, దోసకాయ, టమోటాలతో కలిపి పెంచవచ్చు. తీగల పంటలను వేయరాదు. 2 అడుగుల వ్యాసం, 1 అడుగు లోతు, నీరు పోడానికి కింద రంధ్రం గల కుండీలలో కూడా జుకిని మొక్కలను పెంచవచ్చు.

**రోగాలు :** మొక్కలకు, లేత కాయలకు పురుగులు పడతాయి. పురుగులు 0.20 నుండి 0.25 అంగుళం పరిమాణంలో నల్ల మూతి, నల్లని కాళ్ళు, వంటిపై నలుపు-పసుపు మచ్చలతో ఉంటాయి. లార్వా దశలో భూమిలో ఉండి వేర్లను తింటాయి. భూమి బాగా ఎండిన తర్వాత విత్తనాలు విత్తితే లేదా మొలకలు నాటితే పురుగులు పట్టవు. వారానికి ఒకసారి పురుగుల మందునుపొడిగా కాని, నీటిలో కలిపి కాని చల్లాలి.

**ఉపయోగాలు :** ఒక కప్పు అంటే 124 గ్రాముల జుకిని ముక్కల్లో ఉండే పోషక విలువలు:- 17 గ్రాముల క్యాలరీల శక్తి, 1.31 గ్రాముల మాంసకృత్తులు, 3.27 గ్రాముల కార్బొహైడ్రేట్స్, 1 గ్రాము కంటే తక్కువ కొవ్వు, 1.36 గ్రాముల పీచు, 16.95 గ్రాముల సున్నం, 280.24 గ్రాముల పొటాషియం, 384 యూనిట్ల విటమిన్ ఎ, సి

కె, బి6, బి9,24.93 మైక్రో గ్రాముల ఫోలిక్ యాసిడ్, మెగ్నీషియం, మాంగనీస్, థియామిన్, బీటా కెరొటిన్ పుష్కలంగా ఉన్నాయి. కొద్ది మోతాదులలో ఇనుము, యశదం ఉంటాయి. జుకిని ఎముకలు, థైరాయిడ్, వీర్యగ్రంధి ఆరోగ్యాలను కాపాడుతుంది. జుకిని కాయల్లో చాలా తక్కువ కర్బన శక్తి ఉంటుంది. ఖనిజాలు, అనామ్ల జనకాలు అధికంగా ఉంటాయి. జుకిని కాయలను రోజూ తింటే బరువు తగ్గుతాము. ఇందులో నీటి శాతం, పీచు ఎక్కువ. కార్బన్ తక్కువ. కొద్దిగా తినగానే కడుపు నిండుతుంది. ఆకలి తీరుతుంది. జుకిని జీర్ణశక్తిని పెంచుతుంది. మలబద్ధకాన్ని, రక్తపోటు, మధుమేహాలను తగ్గిస్తుంది. ఉదరకోశ, మూత్రపిండాల వ్యాధులను నిరోధిస్తుంది. జుకిని తొక్కలో అనేక పోషక విలువలు ఉంటాయి. అందుకే వీటిని తొక్కతోసహా తింటారు. జుకినిని ఉల్లిపాయలు, వెల్లుల్లి, పుట్ట గొడుగులు, తులసి, పుదీనా, కొత్తిమీర, వామాకు, మిరియాల పొడి, దాల్చిన చెక్క, వంకాయ, వెన్నలతో కలిపి వంటలు తయారు చేయవచ్చు. ఇది నిద్ర సమస్యలను పరిష్కరిస్తుంది. గుండె, కళ్ళు, చర్మ ఆరోగ్యాలను కాపాడుతుంది. అనేక క్యాన్సర్లను నిరోధిస్తుంది. శాస్త్రీయ ధృవీకరణ లేకున్నా జుకినిని గృహ వైద్యంలో జలుబు, నొప్పుల నివారణకు వాడతారు. జుకిని ఆకులు, పూలు, లేత మొక్కలను కూడా తినవచ్చు. వంటలలో వాడవచ్చు. జుకిని తొక్క వాడినా, ముడతలు, మచ్చలు వచ్చినా, కోయగానే తీగలు, ముదిరిన విత్తనాలు ఉన్నా ఆ జుకినిని తినకూడదు.

**వంటలు :** జుకినిని సాధారణంగా వండి తింటారు. దీనితో రుచికరమైన కూర వండుతారు. అంతే గాక వేయించి, కాల్చి, ఆవిరిపై ఉడక బెట్టి అనేక రకాల వంటలు, బ్రెడ్, కేకులు, ముక్కలు చేసి సాలాడ్ చేస్తారు. జుకినిని పచ్చిగా తినవచ్చు. దీనితో చేసిన నూడిల్స్‌ను జూడిల్స్ అంటారు. ముక్కలను వేయించి వెల్లుల్లి, మెంతులతో కలిపి పెరుగులో ముంచి, లేదా వెల్లుల్లి, ఉల్లి, టొమాటో ముక్కలతో కలిపి తింటారు. వివిధ దేశాల్లో విభిన్న వంటల్లో జుకినిని వాడి రెస్టారెంట్లలో వడ్డిస్తారు. జుకినితో వంటలు చేయని దేశం లేదు. జుకినిని పచ్చిగా తినడం మంచిది. అయితే సాలాడ్‌లు, రొట్టెలు, సూప్‌లు, కేకులు, ఇతర అనేక రకాల విదేశీ వంటకాలలో వాడతారు.

**లాభ నష్టాలు :** జుకిని విత్తనాలు కిలో రూ.5,400 నుండి రూ.7,500 ల వరకు మార్కెట్‌లో లభిస్తాయి. దాదాపు విత్తనం రూపాయి పడుతుంది. జుకిని మొలక ధర రూ.4లు. రైతులు ప్రభుత్వ వ్యవసాయ అభివృద్ధి అధికారులను సంప్రదించవచ్చు. జుకిని కాయల ధర కిలో రూ.50-రూ.150 మధ్య ఉంది. మహారాష్ట్ర సాంగ్లి దగ్గర సాంగోళ తాలూకా సాంగోళ గ్రామంలో ఒక రైతు ప్రత్యక్ష అనుభవం.. ఆయన పొలానికి ముందే నీటివసతి ఉంది. పొలంలో ట్రాక్టర్‌తో బెడ్ తయారు చేశారు. పూర్వం మనం పత్తి గింజలు నాటడానికి బోధ గుంటకతో కాలువలు చేసినట్లు. ఆ బెడ్ పైన ప్లాస్టిక్ కాగితం (మల్చింగ్ షీటు) కప్పుతారు. దానిపై జిగ్ జాగ్‌గా వరుసగా రంధ్రాలు చేస్తారు. అంటే ఒక వరుసలో రెండు రంధ్రాల మధ్య పక్క వరుసలో రంధ్రం వస్తుంది. ఆ రంధ్రాల్లో జుకిని మొక్కలు నాటాలి. ఒక వరుసలో ఒకటి పసుపు, మరొకటి ఆకుపచ్చ మొక్కలను మార్చి మార్చి నాటాలి. ఈ కాగితం



జుకిని పువ్వులు, కాయలు

రెండు పంటలకు పనిచేస్తుంది. ఆ మహారాష్ట్ర రైతు మొలకలతో జుకిని పండించారు. ఒక మొలక రూ.4కు కొన్నారు. నర్సరీలో పసుపు, ఆకుపచ్చ మొక్కలు వేరు వేరుగా అమ్ముతారు. ఎకరానికి 12.5 వేల మొక్కలు వేశారు. మొక్కలు నాటిన తర్వాత వారం పాటు క్రిమి సంహారక మందు కలిపి నీటిని చల్లాలి. లేదా పిచికారి చేయాలి. ఎకరానికి ఖర్చు రూ.80 వేలు అయింది. కుటుంబ సభ్యుల శ్రమ అదనం. ఈ పంటకు శ్రమ తక్కువ. అంటే కూలీల అవసరం తక్కువ. పురుగు మందుల, రసాయనిక ఎరువుల అవసరం లేదు. మొక్క ఒకసారి 8 కిలోల అనగా 20, 25 కాయలు కాసింది. 2,3 నెలల పాటు అలా కాస్తూనే ఉంటుంది. ఎకరానికి 30 టన్నుల పైగా దిగుబడి వస్తుంది. పసుపుపచ్చ జుకినిలను కిలో రూ.80 లకు, ఆకుపచ్చ వాటిని కిలో రూ.60 లకు అమ్మారు. నికర లాభం ఎకరాకు ఏడాదికి రూ 2.5 లక్షలు వచ్చింది. "క్రిస్మస్ కాలంలో అంటే నవంబరు, డిసెంబరుల్లో, జుకినికి మంచి ధర ఉంటుంది. (జుకిని వేసవిలో తినే కాయ. చలికాలంలో గిరాకి పెరగడం మారిన సంస్కృతికి సంకేతం) ఇదివరకు కిలో జుకిని ధర రూ.180ల నుండి రూ.200లు ఉంది. అప్పుడు రూ. 5 లక్షల లాభం వచ్చింది. యాత్రా స్థలాల్లో వీటికి మంచి గిరాకీ ఉంది. మహారాష్ట్ర రైతులు జుకిని ఉత్పత్తులను ఎక్కువగా గోవాలో అమ్ముతారు" అన్నారు ఆయన. వారిది సైనిక కుటుంబం. వారి కుటుంబ సభ్యులు జై జవాన్ జై కిసాన్ ద్విపాత్రాభినయం చేశారు. నేను ఈ వ్యాసం రాయడానికి ఆయన ఇచ్చిన సమాచారమే ప్రేరణ.

**ఆశ :** సంప్రదాయ పంటల నుండి కొత్త పంటలకు మారితే పంటల మార్పిడి ప్రయోజనం కలుగుతుంది. కొత్త మార్కెట్ల అవకాశాలు లభిస్తాయి. మూస పంటల పోటీ తప్పుతుంది. పట్టణాలు, నగరాలలో జుకిని కాయల ఉపయోగం బాగా పెరిగింది. ప్రభుత్వాల నుండి రాయితీలు కోరవచ్చు.

(వ్యాస రచయిత : ఆల్ ఇండియా
ప్రోగ్రెసివ్ ఫోరం జాతీయ కార్యదర్శి)

# వేసవి కూరగాయల సాగులో సమస్యలు - నివారణ




యం. లక్ష్మీ నాగ నందిని,
వై. శ్రావణి పి.హెచ్. డి. స్కాలర్స్,
డా. వై. యస్. ఆర్. ఉద్యాన విశ్వ విద్యాలయం,
వెంకటరామన్నగూడెం, పశ్చిమ గోదావరి జిల్లా,
ఫోన్ నెంబర్: 7093492058


మన ఆహారంలో కూరగాయలు ముఖ్యపాత్ర పోషిస్తాయి. నిత్యం కూరగాయలను ఆహారంలో భాగం చేసుకోవడం ఆరోగ్యానికి ఎంతో మంచిది. వేసవిలో కూరగాయల ధరలు పెరిగే అవకాశం ఎక్కువగా ఉన్నందున రైతులు తమకు లభించే పరిమితి వనరులతో సరైన యాజమాన్య పద్ధతులు చేపట్టి కూరగాయలు పండిస్తే రైతులు మంచి దిగుబడులను పొందవచ్చు. కానీ వేసవిలో వీచే పొడి గాలులు, క్రమంగా పెరిగే ఉష్ణోగ్రతలు, తగ్గిపోయే నీటి వనరులు, విద్యుత్ సరఫరాలలో అంతరాయం ఇలా అనేక కారణాలు కూరగాయల సాగుకు ప్రతికూలంగా ఉంటాయి. కావున రైతులు వేసవిలో సాగు మెళకువలు తెలుసుకొని పాటించడం అవసరం.

వేసవిలో ఎక్కువ విస్తీర్ణంలో సాగుచేసే కూరగాయ పంటలలో టమాట, వంగ, బెండ, మిరప, తీగజాతి కూరగాయలు ముఖ్యమైనవి. దోస, గుమ్మడి, కాకర, ఆనప వంటి తీగజాతి కూరగాయలను తక్కువ నీటితో సాగుచేసుకోవచ్చు. వేసవిలో కూరగాయల సాగులో వచ్చే సమస్యలను గమనిస్తే ప్రధానంగా నీటి ఎద్దడి, పూత, పిందె రాలడం, పంటలను ఆశించే చీడపీడలు అనేవి ప్రధానమైనవి.

**నీటి ఎద్దడి :**

కూరగాయలలో సుమారు 80 నుండి 95 శాతం వరకు నీరు ఉంటుంది. కావున కూరగాయల సాగులో నీటి ఎద్దడి ఏర్పడితే దిగుబడితోపాటు నాణ్యత కూడా గణనీయంగా తగ్గిపోతుంది. కూరగాయలలో నీటి ఎద్దడి ప్రభావం దశను బట్టి ఉంటుంది. మొక్కలు తొలి దశలో నీటి ఎద్దడి ఏర్పడితే మొక్కల పెరుగుదల, పక్వ దశకు వచ్చే కాలపరిమితి పెరుగుతుంది. అదే పంట పక్వ దశలో నీటి ఎద్దడి ఏర్పడితే పూత, పిందె రాలి పంట దిగుబడితోపాటు నాణ్యత కూడా దెబ్బతింటుంది. కాబట్టి రైతులు నీటి ఆవశ్యకత, ఎప్పుడు నీరు అందించాలి అనే అంశాలపై దృష్టి సారించాలి.

- వేసవిలో నేలలోని తేమను సంరక్షించే పద్ధతులు పాటించాలి. ఎక్కువ మోతాదులో పశువుల ఎరువు వాడటం వలన భూమిలో తేమ ఎక్కువ రోజులు నిల్వ ఉంటుంది.
- మల్చింగ్ పద్ధతి ద్వారా నేలలోని తేమ ఆవిరి రూపంలో పోకుండా ఉంచి, కలుపు పెరుగుదలను అదుపులో ఉంచుతుంది. ఇది రెండు రకాలు. సేంద్రియ మల్చ్‌లు అనగా కత్తిరించిన గడ్డి, పంట వ్యర్థాలు వంటివి. ఇవి అందుబాటులో లేనప్పుడు మార్కెట్లో దొరికే ప్లాస్టిక్ మల్చ్ వాడుకోవచ్చు.
- సాధారణంగా వేసవిలో ఎంత నేల మొక్కలు లేకుండా ఖాళీగా ఉంటుందో అంత ఎక్కువ నీరు ఆవిరి రూపంలో పోతుంది. కావున వేసవిలో మొక్కలు ఎక్కువ సాంద్రతలో ఉండేటట్లు చూసుకోవాలి. వరుసల మధ్య, మొక్కకూ మొక్కకూ మధ్య దూరం తగ్గించుకోవాలి. విత్తనాలు విత్తేటప్పుడు 2 నుండి 3 సెం.మీ. లోతులో విత్తుకొని రోజు విడిచి రోజు తక్కువ మోతాదులో నేలలో తేమ ఉండేటట్లు చూసుకుంటే, అధిక మొలక శాతం వచ్చి మొక్కల సాంద్రత కూడా ఎక్కువగా ఉంటుంది.

**నీటి తడులు :**

నీటి ఎద్దడి ఏర్పడే ప్రాంతాల్లో నీటి వనరులు సరిపోవు అనుకున్నప్పుడు, కూరగాయల్లో సున్నిత దశను తెలుసుకొని, పంట, నేల స్వభావాన్ని బట్టి నీరు అందించాలి. టమాటకు ప్రతి 5–6 రోజులకు ఒక తడి ఇస్తూ పూత, పిందె దశలో శ్రద్ధ చూపాలి. క్రమ

పద్ధతిలో నీరు ఇవ్వకుంటే కాయ పగిలే అవకాశ ముంది. వంగకు 4-5 రోజులకొక తడివ్వాలి. నీటి ఎద్దడి వస్తే కాయ రంగు, పరిమాణం తగ్గి, కాయల్లో చేదు వచ్చి నాణ్యత కోల్పోతుంది.

బెండకు ప్రతి 4 రోజులకు ఒకసారి తడి అవసరం. పూత, పిందె దశల్లో కాక కాయ పెరుగుదల దశలో నీటి ఎద్దడి వస్తే దిగుబడి తగ్గిపోతుంది. బీర, సొర, కాకర, గుమ్మడి పాదులకు వారం రోజులకొక తడివ్వాలి. పూత, కాయ ఎదిగే దశలో నీటి ఎద్దడి వస్తే కాయలు రాలిపోవడమే కాక కాయలు డొల్లపోయి నాణ్యత తగ్గుతుంది.







**నీటి ఆదా పద్ధతులు :**

మనకు అందుబాటులో ఉన్న ఆధునిక నీటి పద్ధతుల్లో బిందు సేద్యం ముఖ్యమైనది. బిందు సేద్యం పద్ధతి ద్వారా నీరు అందించడం వలన 70-80 శాతం నీరు ఆదా చేసుకోవచ్చు. ఈ పద్ధతిలో మొక్కల అడుగు భాగాన ఎక్కువ తేమ ఉండదు కాబట్టి, తెగుళ్ళు కూడా తక్కువగా ఆశిస్తాయి. వేసవిలో ఆకుకూరల సాగులో తుంపర్ల పద్ధతి (స్ప్రింక్లర్) లాభదాయకం. అధిక దిగుబడికి, ఎక్కువ కోతలకు రోజు విడిచి రోజు నీరు అందించాలి.

**నీటి ఎద్దడిలో ఎరువుల యాజమాన్యం :**

వేసవి నీటి ఎద్దడి ఉన్నప్పుడు ఎరువుల యాజమాన్యంలో కూడా కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. సాధారణంగా అన్ని రసాయనిక ఎరువులు లవణ గుణాలు కలిగి ఉంటాయి. అంటే రసాయనిక ఎరువులు నీటిని పీల్చుకొని కరిగి మొక్కలకు అందుబాటులోకి వస్తాయి. కావున వేసవిలో కూరగాయలకు రసాయనిక ఎరువులు మొక్కలకు దగ్గరగా వేయకుండా 5 సెం.మీ. దూరంలో వేసుకోవాలి. తక్కువ మోతాదులో ఎక్కువ సార్లు ఇచ్చి తడులు అందించాలి. మార్కెట్లో నీటిలో కరిగే ఎరువులను (ఉదా : 14-14-14, 13-0-45, 19-19-19) నీటితో పాటుగా (ఫెర్టిగేషన్ పద్ధతి ద్వారా) లేదా మొక్కలపై పిచికారీ పద్ధతిలో కూడా అందించవచ్చు.

**నీటి ఎద్దడిని తట్టుకునే రకాలను వాడడం :**

వేసవిలో సాగుకు అనుకూలంగా ఉన్న రకాలను మాత్రమే ఎంపిక చేసుకోవాలి. సాధారణంగా సంకర జాతి రకాలకన్నా సూటి రకాలు ఎక్కువ బెట్టను తట్టుకోగలుగుతాయి. కావున నీటి ఎద్దడిని తట్టుకొనే రకాలు వేసుకుంటే రైతులు అధిక దిగుబడులను పొందవచ్చు.

**పూత, పిందె రాలడం :**

వేసవిలో అధిక ఉష్ణోగ్రతలు, వేడిగాలుల వల్ల పూత, పిందె రాలుతుంది. దీనిని నివారించడానికి నేలలో తేమ ఒడిదుడుకులు లేకుండా చూసుకోవాలి. టమాట, వంగ పంటలకు ప్లానోఫిక్స్ (ఎన్.ఎ.ఎ) 2.5 మి.లీ. 10 లీటర్ల నీటిలో కలిపి పూత దశలో వారం వ్యవధిలో రెండుసార్లు పిచికారీ చేయాలి. మిరప పూత దశలో ట్రైకాంటినాల్ 20 మి.గ్రా. లేదా ప్లానోఫిక్స్ 2.5 మి.లీ. 10 లీటర్ల నీటిలో కలిపి రెండుసార్లు పిచికారీ చేస్తే పిందె నిలుస్తుంది. తీగజాతి కూరగాయల్లో అధిక ఉష్ణోగ్రతల కారణంగా మగపూలు ఎక్కువగా వచ్చి లింగ నిష్పత్తి తగ్గి, దిగుబడి తగ్గుతుంది. నివారణకు పూతదశలో సైకోసిల్ 25 గ్రా. 10 లీటర్ల నీటిలో కలిపి పిచికారీ చేయాలి.

**సస్యరక్షణ :**

- వేసవిలో రసం పీల్చే పురుగుల ఉధృతి ఎక్కువగా ఉంటుంది. ముఖ్యంగా తెల్లదోమ, పేనుబంక, పిండి పురుగు, నల్లి వంటివి పొడి వాతావరణం ఎక్కువ నష్టాన్ని కలిగిస్తాయి. రసం పీల్చే పురుగుల వల్ల వైరస్ తెగులు వ్యాప్తి జరుగుతుంది. వీటి నివారణకు సమగ్ర సస్యరక్షణ చర్యలు చేపట్టాలి. పొలం చుట్టూ జొన్న లేదా సజ్జ పంటలను అడ్డు పంటగా వేయడం వల్ల రసం పీల్చే పురుగుల ఉధృతిని కొంత వరకు తగ్గించవచ్చు. పొలంలో అక్కడక్కడ ఎకరాకు 4 చొప్పున పసుపు రంగు డబ్బాలు లేదా రేకులను ఆముదం, గ్రీజు పూసి పెట్టాలి. తెల్లదోమలు దీనికి ఆకర్షింపబడతాయి.
- మొక్క పెరుగుదల దశలో నాటిన 30 రోజుల నుంచి పూత వరకు 5 శాతం వేప కషాయాన్ని 15 రోజుల తేడాతో పిచికారీ చేయాలి. రసం పీల్చే పురుగుల నివారణకు డైమిథోయేట్ లేదా మెటాసిస్టాక్ లేదా ఫిప్రోనిల్ 2 మి.లీ. లేదా ఎసిఫేట్ 1.5 గ్రా. లేదా ఇమిడాక్లోప్రిడ్ 0.3 మి.లీ. లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి.
- తీగజాతి కూరగాయల్లో పండు ఈగ బెడద నుండి నివారణకు మలాథియాన్ 2 మి.లీ. లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి. ఈ విధంగా పై పద్ధతులను అనుసరిస్తే రైతులు వేసవిలో కూరగాయల సాగు ద్వారా మంచి దిగుబడులను పొంది తద్వారా అధిక రాబడిని పొందవచ్చు.

# టమాటలో విత్తనోత్పత్తి





**కె. నిరోష,** అసిస్టెంట్ ప్రొఫెసర్
(కూరగాయల విభాగం),
ఉద్యాన కళాశాల, రాజేంద్రనగర్, హైదరాబాద్

### విత్తనం ప్రాముఖ్యత

విజయవంతమైన పంట ఉత్పత్తికి అత్యంత ముఖ్యమైన, ప్రాథమిక కీలక ఉత్పత్తి కారకం విత్తనం. అందుకే సాగులో ఎనలేని ప్రాధాన్యత విత్తనానిది. నాణ్యమైన విత్తనం నాటితే సగం దిగుబడి సాధించినట్లే అన్నది ఆర్యోక్తి. కూరగాయల పంటల సాగులో కూడా విత్తనం ప్రాధాన్యత ఎక్కువే ఉత్పత్తి, ఖర్చులలో మరీ ఎక్కువ పాళ్లు తీసుకోనప్పటికీ, ఎరువులు, సాగునీరు, సస్యరక్షణ మందులు, శుద్ధి విధానాలు వంటి ఇతర ఉత్పత్తి కారణాల వాడుక సామర్థ్యం విత్తనంపైనే ఉంటుంది. నాణ్యమైన విత్తనమే సాగులో అధిక దిగుబడికి, ఆదాయం రాబడికి పునాది.

**నాణ్యమైన విత్తనం లక్షణాలు :** సిఫార్సు మేరకు భౌతిక స్వచ్ఛత, జన్యు స్వచ్ఛత, మొలక సామర్థ్యం, తేమ శాతం, కలుపు విత్తనాలు, ఇతర పంటల విత్తనాలు, తెగుళ్లు సోకిన విత్తనాలు లేకుండా వుండటం.

భారత విత్తన చట్టం, 1966 ప్రకారం రైతుకు అందుబాటు విపణిలో లభించేవి రెండు రకాల విత్తనాలు. ఒకటి - ధృవీకరణ విత్తనం. రెండవది - ట్రూత్ఫుల్లీ లేబెల్ట్ విత్తనం. విత్తన చట్టం ప్రకారం దేశంలో విక్రయానికి ఉంచిన ప్రతి విత్తనం కచ్చితంగా లేబిల్ (విత్తన వివరాలతో కూడిన సమాచారం) ఉండాలి. ధృవీకరణ ఉన్నా లేదా లేకున్నా లేబిల్ ఖచ్చితంగా ఉండాలి. ధృవీకరణకు విత్తనోత్పత్తిదారుడు విత్తన క్షేత్రాన్ని ముందుగా నమోదు చేసుకోవాలి. విత్తన ధృవీకరణ ఏజెన్సీ అధికారులు విత్తనోత్పత్తిదారుడి క్షేత్రాన్ని నిర్దేశిత సూత్రాల మేరకు తనిఖీ చేస్తారు. ఆ తర్వాత అన్ని అంశాలలో సంతృప్తి చెందిన తర్వాత లేబిల్ మంజూరు చేయటం జరుగుతుంది. ట్రూతఫుల్లీ లేబెల్ట్ విత్తనాల ఉత్పత్తిని ఆయా విత్తన సంస్థలే పర్యవేక్షించుకుంటాయి. ఇవి ధృవీకరణ విత్తనాలు కావు. ధృవీకరణ విత్తనాలు రాష్ట్ర లేదా కేంద్ర వంగడాల విడుదల కమిటీలు విడుదల చేసినవి అయి వుండాలి. ధృవీకరణ విత్తనాలకు నీలి రంగు లేబిల్, ట్రూతఫుల్లీ లేబెల్ట్ విత్తనాలకు ఆకుపచ్చ రంగు లేబిల్ ఉంటుంది. ఉత్పత్తి చేసిన విత్తనాన్ని పంటను బట్టి కొంత కాలం వరకు నిల్వ చేసుకొని సాగుకు వాడుకోవచ్చు.

కూరగాయల పంటలలో విత్తనోత్పత్తి మిక్కిలి నైపుణ్యతతో కూడిన పని. ప్రత్యేక విషయ పరిజ్ఞానం, నైపుణ్యత అవసరం, వేడి వాతావరణంలో దాదాపు అన్ని కూరగాయలలో సంతృప్తిగా, సిఫార్సుల మేరకు విత్తనోత్పత్తి చేపట్టవచ్చు. క్యాబేజి, ఆలస్యంగా కోతకొచ్చే పూగోబి, ఐరోపా రకపు దుంప కూరలలో విత్తనోత్పత్తి కేవలం చల్లని వాతావరణంలోనే సాధ్యం. రైతులు తమ స్థాయిలో విత్తనోత్పత్తికి సంకర రకాలను ఎన్నుకోరాదు. కేవలం ప్రభుత్వ రంగ సంస్థలు, విశ్వవిద్యాలయాలు విడుదల చేసిన రకాలలో మాత్రమే విత్తనోత్పత్తి చేపట్టాలి. అందుకు కావలసిన విత్తనాన్ని సంబంధిత బ్రీడరు లేదా సదరు సంస్థ లేదా అధీకృత ఏజెన్సీ నుండే పొందాలి. రశీదును భద్రపరచుకోవాలి. విత్తనోత్పత్తికి ముందుగానే క్షేత్రంలో వేర్పాటు దూరం, మురుగు నీరు పోయే సౌకర్యాలను నిర్ధారించుకోవాలి. అప్పుడే మేలైన విత్తనోత్పత్తి సాధ్యం.

### తెలంగాణ రాష్ట్రం దేశ విత్తన రాజధాని.

అమెరికాలోని అరిజానా రాష్ట్రం, భారత్లోని తెలంగాణ రాష్ట్రం విత్తనోత్పత్తికి పూర్తిగా అత్యంత అనుకూలమైనవి. అన్ని పంటల విత్తనోత్పత్తికి కావలసిన వైవిధ్య వాతావరణ మండలాలు, చల్లని, పొడి వాతావరణం, తక్కువ గాలిలో తేమ, పుష్కలమైన సూర్యరశ్మి, ఎర్రనేలలు తెలంగాణ రాష్ట్రంలో ఉన్నాయి. విత్తన నిల్వలకు సరిపోయే గాలిలో ఆర్ద్రత తక్కువగా ఉండటం, వాయు, రోడ్డు మార్గాల ద్వారా అంతర్జాతీయంగా వివిధ దేశాలకు రాకపోకలకు అనుకూలంగా





వుండటంతో ఇప్పటికే రాష్ట్రంలో దాదాపు 15-25 శాతం భూములు విత్తన క్షేత్రాలుగా మారాయి. చిన్న, మధ్యస్థ, బహుళజాతి విత్తన సంస్థలు కలిపి 370 కు పైనే తెలంగాణలో ఉన్నాయి. దేశంలో ఉత్పత్తి అవుతున్న విత్తనాలలో 60 శాతంపైగా ఒక్క తెలంగాణ రాష్ట్రం నుండే, ఉమ్మడి వరంగల్, కరీంనగర్ జిల్లాల్లో 90 శాతం పైగా సంకర రకాల విత్తనోత్పత్తి జరుగుతుంది. రాష్ట్రంలోని సంకరజాతి గడ్డి జొన్న, హైబ్రిడ్ సజ్జల ఉత్పత్తి రాష్ట్రంలోని నిజామాబాద్లోని ఆర్మూర్ పరిసర ప్రాంతాలలో జరుగుతుంది. విత్తనోత్పత్తికి అనుకూలమైన సహజ వనరులు, నైపుణ్యమున్న మానవ వనరులు ఇందుకు తోడ్పడుతున్నాయి. విత్తనోత్పత్తి గ్రామాలుగా ప్రపంచ ప్రసిద్ధి గాంచిన అంకాపూర్ గ్రామంలో రైతులు విత్తనోత్పత్తిదారుగా విజయాన్నందుకున్నారు. తెలంగాణలో గాలిలో తక్కువ తేమవల్ల విత్తనోత్పత్తిలో తెగుళ్ళ సమస్య తక్కువ, పుప్పొడి రేణువుల ఉత్పత్తి పెరిగి అధిక విత్తనోత్పత్తి జరుగుతుంది. విత్తన నాణ్యత బాగుంటుంది. కూరగాయల పంటలలో బెంగుళూరు, జాల్నాలతో సమానంగా రాష్ట్రంలో విత్తనోత్పత్తి జరుగుతుంది.

### టమాటలో విత్తనోత్పత్తి

రాష్ట్రంలో సాగవుతున్న కూరగాయలలో ప్రధాన పంట టమాట. వర్షాకాలంలో ఎక్కువ విస్తీర్ణంలో సాగవుతుంది. చిన్న, సన్నకారు రైతులు కూడా ఎక్కువగా ఈ పంటను వేస్తారు. తమకు కావలసిన విత్తనాలను సొంతంగా ఉత్పత్తి చేసుకునే వీలుంది. అందుకు కొన్ని మెళకువలు పాటించాలి.

**వాతావరణం :** టమాట ఉష్ణ మండలపు పంట. విత్తనోత్పత్తికి సుమారు నెలలపాటు మంచు రహిత వాతావరణం అవసరం. 16 నుండి డిగ్రీల సెంటిగ్రేడు ఉష్ణోగ్రత విత్తనం మొలకెత్తటానికి అనుకూలం. మొక్కల అభివృద్ధికి, కాయలు ఏర్పడటానికి 20 నుండి 25 డి. సెం. ఉష్ణోగ్రత ఉండాలి. 15 డిగ్రీల సెంటిగ్రేడ్ కంటే తక్కువ, 32 డి. సెం. కంటే ఎక్కువ ఉష్ణోగ్రత ఉంటే పుప్పొడి రేణువులు చనిపోతాయి. అందువల్ల కాయలు కట్టే అవకాశం తగ్గుతుంది. అత్యధిక, అత్యల్ప ఉష్ణోగ్రతలు, నీటి ఎద్దడి కాయలు ఏర్పడే శాతాన్ని తగ్గిస్తాయి. అధిక ఉష్ణోగ్రత, వేడిగాలులు వల్ల పూత, పిందె రాలుతుంది. వెచ్చని సూర్యరశ్మితో కూడిన వాతావరణం, కాయలు ఏర్పడటం, కాయల వృద్ధి, విత్తన అభివృద్ధికి అత్యంత అనుకూలం.

రాష్ట్రంలో సాధారణంగా ఖరీఫ్, రబీ, వేసవి కాలాలలో సాగు చేసే అన్ని సూటి రకాల విత్తనోత్పత్తి వేసవిలో చేపట్టవచ్చు. అయితే విత్తనోత్పత్తిలో టమాట పూత, సంపర్కం చెందే లక్షణాలపై అవగాహన అవసరం.

ఒక పూగుత్తిలో సరాసరిన 4- 5 పూలు వుంటాయి. పూలు విచ్చుకోవటం నేలలో తేమ, ఉష్ణోగ్రతను బట్టి ఉంటుంది. ఉదయం 8.30 - 10.30 గంటల మధ్య పూలు విచ్చుకుంటాయి. 9 - 10.30 గంటల మధ్య పుప్పొడి రేణువులు విడుదలవుతాయి. 8.30 - 11.30 గంటల మధ్య సమయంలో కీలాగ్రం చుట్టూ పుప్పొడి అశయాలు ఉండటం వల్ల టమాట ప్రధాన స్వపరాగ సంపర్కం చెందే పంట. అయితే బంబుల్ ఈగలు పూలను తరచు సందర్శించటం వల్ల 3.8% వరకు పరపరాగ సంపర్కం చెందే అవకాశాలున్నాయి.

**వేర్పాటు దూరం :** ఒక టమాట రకం నుండి మరో టమాట రకం పంటకు ఫౌండేషన్ విత్తనోత్పత్తికి 50 మీటర్ల ధృవీకరణ విత్తనోత్పత్తికి 25 మీటర్ల వేర్పాటు దూరముండాలి.

**నేలలు :** మేలైన మురుగు నీటి పారుదల సౌకర్యమున్న ఒండ్రుమట్టి నేలలు, ఎర్రనేలలు, ఇసుకతో కూడిన ఒండ్రు నేలలు ఈ పంట సాగుకు అనుకూలం. ఉదజని సూచిక 6-7 మధ్య ఉండి, తేమ నిలుపుకునే సామర్థ్యమున్న నేలలు అనుకూలం.

**ఎరువులు :** హెక్టారుకు 25 టన్నులు బాగా చివికిన పశువుల ఎరువు, 100 కిలోల నత్రజని, 50 కిలోల చొప్పున భాస్వరం, పొటాష్నిచ్చే ఎరువులను వాడాలి. మొత్తం భాస్వరం, పొటాష్లు, 30 శాతం సిఫార్సు నత్రజని ఎరువును దుక్కి సమయంలో, మిగతా నత్రజనిని రెండు దఫాలుగా ప్రధాన పొలంలో నాటిన 30, 50 రోజుల తర్వాత పంటకు అందించాలి. పైపాటు ఎరువులు వేసిన తర్వాత, బోదెలు సరిచేసిన తర్వాత ఖచ్చితంగా తేలికపాటి నీటి తడులివ్వాలి. విత్తన మోతాదు హెక్టారుకు 500-600 గ్రాములు.

**విత్తే సమయం :** సంవత్సరమంతా విత్తుకోవచ్చు. అయితే జనవరి-మార్చి మొదటి వారం వరకు విత్తుకుంటే విత్తనోత్పత్తి ఎక్కువ. అయితే సాగు నీటి సౌకర్యం ఖచ్చితంగా ఉండాలి.

**నారుమడి :** ఎత్తైన నారుమడులలో మాత్రమే నారు పెంచాలి. నీటి క్యాన్లతో రోజూ నారుమడులను తడపాలి. చలి కాలంలో అయితే పాలిథీన్ షీట్లతో కప్పి అధిక చలి తీవ్రత నుండి కాపాడుకోవాలి. మొక్కలు 45 సెం.మీ. ఎత్తు పెరిగినప్పుడు, ఆరోగ్యవంతమైన వాటిని ఉంచి, తెగులు సోకిన, అంతగా ఎదగని మొక్కలను తీసివేయాలి. 12-15 సెం.మీ. ఎత్తు పెరిగి 45 వారాల మొక్కలను ప్రధాన పొలంలో నాటాలి. మార్చి చివరి నాటికి ప్రధాన పొలంలో నాటడం పూర్తి చేయాలి. చలి తగ్గిన తర్వాత నాటాలి. బోదెల చివర్లో 60-75 సెం.మీ. దూరంలో నాటాలి. మొక్కకు మొక్కకు మధ్య 45-60 సెం.మీ. దూరం ఉండాలి. నాటు వేసిన 20-25 రోజులు, 40-45 రోజులకు రెండుసార్లు కలుపు నివారణ చేపట్టాలి. హెక్టారుకు ఒక కిలో చొప్పున పెండిమిథాలిన్, 650 లీటర్ల నీటిలో కలిపి మొక్కలు

నాటిన 4, 5 రోజుల లోపు పిచికారి చేసి కూడా కలుపు నివారించవచ్చు.

**నీటి యాజమాన్యం :** విత్తనోత్పత్తిలో నీటి యాజమాన్యం అత్యంత కీలకం. అధిక, అల్ప నీటి తడులు ప్రమాదం. 7-15 రోజుల మధ్య నీటి తడులివ్వాలి. నీటి ఎద్దడి ఏర్పడితే పూత, పిందె రాలిపోతువంది. ఆ తర్వాత ఒకేసారి ముమ్మరంగా నీటి తడులిచ్చినా కాయ అభివృద్ధి తగ్గిపోతుంది. కాబట్టి తక్కువ వ్యవధిలో ఎక్కువ సార్లు నీటిని అందించాలి.

**కల్తీలు :** స్వచ్ఛమైన విత్తనోత్పత్తికి టమాటలో మూడు సార్లు కల్తీలు ఏరివేయాలి. శాఖీయ దశ, పూర్తి పూత దశ, కాయలు ముదిరే దశలో భౌతిక లక్షణాల ఆధారంగా కల్తీలు గుర్తించాలి. వీటతోపాటు ఆకుమచ్చ తెగులు, మొజాయిక్ తెగుళ్ళు, ఎర్లీబ్లైట్ సోకిన మొక్కలను ఏరివేయాలి. విత్తన పొలంలో కల్తీలు 0.5 శాతం కంటే ఎక్కువగా ఉండరాదు. అలాగే విత్తనం ద్వారా వ్యాపించే తెగుళ్ళు సోకిన మొక్కలు కూడా 0.50 శాతం మించి ఉండకూడదు.

**కోత, విత్తన సేకరణ :** విత్తన సేకరణకు బాగా ఎరుపుగా పండిన పండ్లను మాత్రమే ఎంచుకోవాలి. నాణ్యత బాగుండేందుకు మొదటి దశ అలాగే చివరి దశలో వచ్చిన పండ్ల నుండి గింజలు సేకరించరాదు.

**విత్తన సేకరణ పద్ధతులు :** మూడు పద్ధతులు అందుబాటులో వున్నాయి.

**పులియబెట్టే పద్ధతి :** ఎర్రగా పండిన పండ్లను పిసికి ఇనుపేతర గిన్నెలలో పులియబెట్టాలి. వేసవిలో అయితే 24-43. గంటలు, యాసంగిలో అయితే 48-72 గంటలు పులియబెట్టాలి. ఈ విధానం పూర్తయ్యే సరికి గుజ్జుపై నురుగు ఏర్పడుతుంది. గింజలు మిగతా పదార్థం నుండి వేరవుతాయి. ఆ తర్వాత నీటిలో ఉంచితే విత్తనం అడుగు భాగానికి చేరుతుంది. గుజ్జు, ఇతర పదార్థాలు పైన తేలుతాయి. విత్తనం వేరుగా కడిగి, శుభ్రపరచడాలి. ఎక్కువ సమయం పులియకుండా చూడాలి.

**ఆమ్ల శుద్ధి పద్ధతి :** 11 కిలోల టమాట గుజ్జుకు 100 మి.లీ. చొప్పున హైడ్రోక్లోరికామ్లం బాగా కలిపి, 30 నిమిషాల పాటు వుంచాలి. ఆ తర్వాత నీటితో శుభ్రపరచి నిల్వ చేసుకోవాలి.

**గుజ్జు యంత్రం (పర్ వాడకం)తో విత్తన సేకరణ :** ఎక్కువ మొత్తంలో విత్తన సేకరణకు వాణిజ్యంగా టమాట పల్పర్ యంత్రాలు అందుబాటులో ఉన్నాయి. ఈ మెషిన్లు గుజ్జు మిశ్రమం నుండి గింజలను నేరుగా వేరు చేస్తాయి. ఒక రాత్రి మెషిన్లో ఉంచిన తర్వాత కొళాయినీటితో కడిగి శుభ్రపరచాలి.

**విత్తన దిగుబడి10-15 క్వి/హె.**

**భారత కనీస విత్తన ధృవీకరణ ప్రమాణాలు**

**జడ పదార్థం (గరిష్టం):** 2%

**భౌతిక స్వచ్ఛత (గరిష్టం) :** 97%

**ఇతర పంటల విత్తనాలు (గరిష్టం) :** 0.10% మొలక శాతం (కనీసం) 70%

**తేమ శాతం :** సాధారణ సంచులలో 8%, తేమ చేరని సంచులలో 6%

# ఎంఎస్‌పి ఇవ్వాల్సిందే



రైతులు పండించిన అన్ని పంటలకు కనీస మద్దతు ధర ఇవ్వాలని కోరుతూ ఏప్రిల్ 12న దేశవ్యాపితంగా ఆందోళనలు జరిగాయి. కనీస మద్దతు ధర హామీ వారాన్ని పాటించాలని సంయుక్త కిసాన్ మోర్చా ఇచ్చిన పిలుపు మేరకు ఈ నిరసనలు మొదలయ్యాయి. దీనిలో భాగంగా ప్రదర్శనలు, సభలు, సమావేశాలు, సదస్సు వంటి ఆందోళనా కార్యక్రమాలు నిర్వహించింది. ఎంఎస్‌పి హామీ వారోత్సవానికి మద్దతుగా అనేక రాష్ట్రాల్లో నిరసన కార్యక్రమాలు జరిగాయి. స్వామినాథన్ కమిషన్ నివేదిక ఆధారంగా కనీస మద్దతు ధరకు చట్టపరమైన హామీ కోసం ఎస్ కెఎం తన డిమాండ్‌ను పునరుద్ఘాటించింది. ఈ మేరకు ఎస్ కెఎం నేతలు దర్శన్ పాల్, హన్నన్ మొల్లా, జగ్జిత్ సింగ్ దల్లెవాల్, జోగిందర్ సింగ్ ఉగ్రహన్, శివకుమార్ శర్మ 'కక్కాజీ', యుధ్వీర్ సింగ్, యోగేంద్ర యాదవ్ తదితరులు సంయుక్తంగా ప్రకటన విడుదల చేశారు.

రైతు ఉద్యమం 2020 నవంబర్ 26న ప్రారంభం కావడానికి చాలా కాలం ముందు నుండి రైతులు ఎంఎస్‌పి డిమాండ్ చేస్తున్నారని తెలిపారు. ఇది రైతు ఉద్యమ కీలక డిమాండ్లలో ఒకటని స్పష్టం చేశారు. ఎస్ కెఎం, కేంద్ర ప్రభుత్వం మధ్య జరిగిన 11 రౌండ్ల చర్చల సమయంలో ఎంఎస్‌పి చట్టపరమైన హామీ కూడా ఆరు కీలక డిమాండ్లలో ఒకటిగా ఉందన్నారు. 2021 డిసెంబరు 9న ఎస్ కెఎంకు కేంద్ర ప్రభుత్వం రాసిన లేఖలో చేసిన కీలక హామీలలో ఇది కూడా ఒకటని అన్నారు. దాని ఆధారంగా ఢిల్లీలో ఆందోళన వేదికలను ఎత్తివేశామని గుర్తు చేశారు. అయినప్పటికీ, నాలుగు నెలలు గడిచినా ఎంఎస్‌పి చట్టపరమైన హామీపై చర్చించడానికి కేంద్ర ప్రభుత్వం ఇప్పటికీ ఒక కమిటీని వేయలేదన్నారు.



# వేసవి దుక్కులతో ఎంతో మేలు


కె. ఉదయ్, వై. ఉదయ్, యునస్,
పి. శ్రావణి , డి. శివాణి , ఇ. శ్రీహిత,
జె.డి. సరిత, కె. విజయలక్ష్మి,
మృత్తికా విభాగం, వ్యవసాయ కళాశాల, పాలెం.


వర్షాధార పంటలను సకాలంలో విత్తుకుంటేనే ఆశించిన దిగుబడులను పొందవచ్చు. తొలకరిలో సకాలంలో విత్తడానికి రైతులకు తక్కువ సమయం ఉంటుంది. రుతు పవనాలు వచ్చి, వర్షాలు మొదలు కాగానే దుక్కులు తయారు చేసుకుంటే భూమిలో తేమ వృథా అవుతుంది. తగిన సమయంలో విత్తనం చేసుకోలేని పరిస్థితి ఏర్పడుతుంది. దీనికోసం ముందుగానే దుక్కులు సిద్ధం చేసుకుంటే వర్షాలు పడిన తరువాత అదును చూసి విత్తుకునే అవకాశం వుంటుంది.

- సాధారణంగా వర్షాధార ప్రాంతాల్లో వేసంగి తరువాత మళ్లీ వర్షాకాలం వచ్చే వరకూ దుక్కి దున్నకుండా పొలాలను వదిలేస్తారు. ఇలా వదిలివేయడం వల్ల భూమి లోపలి పొరల నుంచి నీరు ఆవిరవుతుంది.
- కలుపు మొక్కలు పెరిగి నీటిని, సాంద్రతను గ్రహించి సత్తువ లేకుండా చేస్తాయి.
- ఏప్రిల్, మే నెలల్లో అడపాదడపా కురిసే వానలను సద్వినియోగం చేసుకొని పొలాలను దున్నుకోవాలి.
- వర్షానికి ముందే భూమి దున్నుకుంటే తొలకరి వానలతో పెళ్లలు మెత్తబడి నీరు భూమిలోకి ఇంకుతుంది. మొలకశాతం బాగుంటుంది.
- వేసవిలో వాలుకు అడ్డంగా దున్నుకోవడం వల్ల వర్షపు నీరు భూమిలోకి ఇంకేందుకు అనుకూల పరిస్థితులుంటాయి. ఎక్కువ తేమ గ్రహించి నీటి నిల్వ సామర్థ్యం పెరుగుతుంది.
- దుక్కులకు ముందు పశువుల ఎరువు, కంపోస్టు, చెరువు మట్టి వెదజల్లడం వల్ల నేల సారవంతమవుతుంది. భూమిలో తేమ నిలుపుకునే శక్తి పెరుగుతుంది. ఆ తర్వాత వీలైతే పచ్చి రొట్ట విత్తనాలు చల్లుకుంటే భూ సారం పెరుగుతుంది.
- వేసవి దుక్కి దున్నటానికి ముందే పొలంలో ఆవుల మందలు, గొర్రెల మందులు వదలాలి. అవి విసర్జించే మలమూత్రాలు భూమిలోకి చేరి సేంద్రియ పదార్థం పెరిగి భూసారం వృద్ధి చెందుతుంది. ఆ తర్వాత వేసే పైరులో సూక్ష్మ పోషక లోపాలను నివారించొచ్చు.
- నేలపై పొరలో గాలి శాతం పెరుగుతుంది. దీనివల్ల సూక్ష్మజీవుల సంఖ్య వృద్ధి చెంది, నేలలో సేంద్రియ కర్బనం పెరుగుతుంది.
- మొక్కల వేర్లు భూమి లోపలి పొరలకు చొచ్చుకొని పోవడం వల్ల నీరు, పోషకాలు గ్రహించే అవకాశం కలుగుతుంది. కలుపు మొక్కలుంటే వేసవిలో ఎక్కువ ఉష్ణోగ్రతతో నశిస్తాయి. తొలకరి కంటే ముందే దుక్కి చేయడం వల్ల భూమిలోని చీడపీడలు కోశస్థ, గుడ్డు దశలు బయటపడి అధిక ఉష్ణోగ్రతతో నాశనమవుతాయి.





# ఆయిల్‌పామ్ సస్యరక్షణ చర్యలు

కె. నరేష్, (పిహెచ్‌డి రీసెర్చి స్కాలర్)
ఆర్. రాజేష్ (ఎంఎస్‌సి, అగ్రి ఎంటమాలజీ)
ఎస్‌కెయుఎఎస్‌టి, కశ్మీర్

## పురుగులు

**కొమ్ముపురుగు :** ఆకుల చివర ఆంగ్ల 'వి' ఆకారంలో ఖాళీలు ఏర్పడతాయి. తల్లి పురుగులు ఆకుల మట్టల కింద బెజ్జాలలో వుండి నమిలి వేసిన పీచును బయటకు నెడతాయి. మొవ్వలో ఈ పీచును బట్టి పురుగు వేసిన నష్టాన్ని గమనించవచ్చు. దీని నివారణకు పెంటకుప్పల మీద కార్బరిల్‌ను పిచికారీ చేసి పిల్ల పురుగుల అభివృద్ధిని నిరోధించాలి. మొవ్వలో సన్న పురుగును తీగతో తీసివేసి 25 గ్రాముల కార్బరిల్ మందును 10 గ్రాముల తడి ఇసుకలో కలిపి మొవ్వలో పెట్టాలి.

**సంచి పురుగులు :** శంకు ఆకారపు సంచుల్లో ఆకు అడుగున వేలాడుతూ ఆకులకు రంధ్రాలు చేస్తాయి. దీని నివారణకు పురుగు సోకిన ఆకులను కత్తిరించి తగులబెట్టాలి. మోనోక్రోటోఫాస్ 10 మిల్లీలీటర్ల నీటికి కలిపి వేరు ద్వారా చెట్టుకు ఎక్కించాలి.

## తెగుళ్లు

**మొవ్వ కుళ్లు తెగులు :** ఈ తెగులు వర్షాకాలంలో తేమ ఎక్కువగా ఉన్నప్పుడు ఉధృతంగా కనిపిస్తుంది. మొవ్వ పసుపు రంగులోకి మారి లాగితే తేలికగా వస్తుంది. కుళ్లిన భాగాల నుంచి దుర్గంధం వస్తుంది. దీని నివారణకు మొవ్వలోని రోగం సోకిన భాగాన్ని తీసేసి కార్బండిజమ్ 20 గ్రాములకు 100 మిల్లీలీటర్ల నీటిని కలిపి పలుచటి ముద్దలా చేసి పూయాలి. దీనితోపాటు మోనోక్రోటోఫాస్ 1 మిల్లీ లీటరుకు 1లీటరు నీటిని కలిపి వేరు ద్వారా ఎక్కించాలి. సేంద్రియ ఎరువులు అధికంగా వాడాలి.

**గానోడెర్మా తెగులు :** కింది వరసల్లోని ఆకులు ఎండిపోతాయి. క్రమంగా తెగులు మొవ్వలోపలికి చేరి కాండం మొదలు వద్ద కణజాలం కుళ్లి చెట్టు చనిపోతుంది. దీని నివారణకు కాలిక్సన్ 10 మిల్లీలీటర్లకు 1 లీటరు నీటిని కలిపి వేరు ద్వారా ఎక్కించాలి. లేదా తెగులు సోకిన చెట్లను ఇతర చెట్ల నుంచి 1 మీటరు లోతైన కాలవ ద్వారా వేరు చేయాలి.

**కాండం తడి తెగులు :** ఈ తెలుగు సోకిన చెట్ల మొవ్వలు అకస్మాత్తుగా వడలి, ఎండిపోయి, మిగిలిన ఆకులు పసుపు రంగులోకి మారి త్వరితంగా వడిలిపోతాయి. దీని నివారణకు ఈ చెట్ల కాండానికి శస్త్ర చికిత్స చేసి కుళ్లిన పదార్థాన్ని తీసివేసి కార్బండిజమ్ మందుతో శుద్ధి చేయాలి. పామాయిల్ చెట్లకు రాగి ఆధారిత శిలీంధ్రనాశులను వాడరాదు.

## ఎలుకల నివారణ

ఎలుకలు మొక్కల గడ్డలను తింటాయి. పిండిన పండ్లను తిని పంట నష్టాన్ని కలిగిస్తాయి. వీటి నివారణకు 96 భాగాలు నూకలు, 2 భాగాల వంట నూనె, 2 భాగాల 0.25 శాతం సి.బి. (బ్రోమోడయోలోన్) కలిపి విషపు ఎర మిశ్రమాన్ని తయారు చేసి కాండం మొదళ్లను లేదా పండ్ల భాగంలోనూ అమర్చాలి.

# వ్యవసాయంలో భూసార పరీక్ష దాని ఆవశ్యకత



డా. కె. మదన్ మోహన్ రెడ్డి, డా. జి. మంజులత,
డా. జి. ఉషా రాణి, డా. పి. మధుకర్ రావు,
డా. డి. శ్రావణి, డా. ఎ. విజయభాస్కర్
ఏరువాక కేంద్రం,
వ్యవసాయ పరిశోధనా స్థానం, కరీంనగర్.

నేలలు వాటిలోని సహజంగా ఉన్న పోషక పదార్థాలతోపాటు, అదనంగా వేసిన సేంద్రియ, రసాయనిక ఎరువుల్లోని పోషకాలను మొక్కలకు అందజేసి పంట దిగుబడికి దోహదపడతాయి. కాబట్టి నేలల్లో ఉన్న భూసారాన్ని తరుచూ తెలుసుకోవడం ఎంతో అవసరం. తద్వారా ఎరువుల వాడకంలో అనవసరపు ఖర్చులు చేయకుండా, భూసారాన్ని కాపాడుకుంటూ, అధిక, సుస్థిర దిగుబడులను పొందవచ్చు. దీనికి సంబంధించి రైతులు తమ పొలంలోని మట్టిని రెండేళ్లకు ఒకసారి పరీక్ష చేయించుకుంటే మంచిది. పోషక పదార్థాల గురించే కాకుండా, భూమిలోని చౌడు గుణాలను, సున్నం శాతాన్ని, నేల కాలుష్యాన్ని గుర్తించేందుకు కూడా భూసార (మట్టి) పరీక్ష చేయించుకోవాలి.

భూసార (మట్టి) పరీక్ష అనగా రైతు పొలం నుండి సేకరించిన మట్టి నమూనాలను వివిధ భౌతిక, రసాయనిక పరీక్షల ద్వారా పోషక పదార్థాల పరిమాణం లెక్కకట్టి, ఆపై వేరు వేరు పంటలలో అధిక దిగుబడి సాధించడానికి వినియోగించవలసిన ఎరువులను సిఫారసు చేయడమే.

భూసార పరీక్షలో అన్నిటికన్నా ముందు తెలుసుకోవాల్సిన విషయం మట్టి నమూనాను సేకరించడం. భూసార పరీక్ష కోసం తీయవలసిన మట్టి నమూనా సరైనది కానిచో, దాని భౌతిక, రసాయనిక, జీవ లక్షణాలు మన పొలం లక్షణాలను ప్రతిబింబించేదిగా ఉండదు. దీని వలన చేయించిన భూసార పరీక్ష, దానికి అనుగుణంగా చేసిన ఎరువుల సిఫార్సులు వ్యర్థం అవుతాయి. కాబట్టి, మట్టి నమూనా సేకరణలో జాగ్రత్తలను తప్పక పాటించాలి.

**మట్టి నమూనా సేకరణ విధానం జాగ్రత్తలు :**

- పొలంలో ఉన్న మట్టి మొత్తం పరీక్షించడానికి వీలు కాదు, కాబట్టి మట్టి నమూనాను సేకరించి విశ్లేషణకు ఉపయోగిస్తారు.
- నేలపై ఉన్న గడ్డి, చెత్త, కలుపు మొదలగు వాటిని తీసివేయాలి.
- ఆగరును గాని, పారనుగాని, తాపీని గాని ఉపయోగించి మట్టి నమూనాలను సేకరించవచ్చు.
- పొలంలో "వి" ఆకారములో 15 సెం.మీ. (6-8 అంగుళాలు) వరకు పారతో గుంట తీసి, అందులో పైపొర నుంచి క్రింది వరకు ఒక ప్రక్కగా మట్టిని సేకరించాలి.
- ఈ విధంగా ఎకరా విస్తీర్ణంలో 8-10 చోట్ల సేకరించిన మట్టిని ఒక దగ్గర చేర్చి, బాగా కలిపి 4 భాగాలుగా చేయాలి. అందులో ఎదుటి భాగాలు తీసుకుని, మిగతా భాగాలు తీసివేయాలి. ఈ విధంగా మట్టి 1/2 కిలో వచ్చే వరకు చేయాలి.
- ఇలా సేకరించిన మట్టిలో రాళ్లు, పంట వేర్ల మొదళ్ళు లేనట్లుగా చూసుకుని, నీడలో ఆరనివ్వాలి.
- మట్టి నమూనా సేకరణకు రసాయనిక/సేంద్రియ ఎరువుల సంచులను వాడరాదు.
- మట్టి నమూనా కోసం పొలంలో మట్టిని త్రవ్వి సేకరించినపుడు గట్ల దగ్గరలోను, పంట కాల్వలలోను మట్టిని తీసుకోరాదు.
- చెట్ల క్రిందనున్న పొలం భాగం నుండి మట్టిని సేకరించరాదు.
- ఎరువు (పశువుల పేడ, కంపోస్టు, వర్మీ కంపోస్టు, పచ్చి రొట్ట మొదలగునవి) కుప్పలు వేసి ఉంచిన చోట మట్టిని సేకరించరాదు.
- ఎప్పుడూ నీరు నిలబడే పల్లపు స్థలములో మట్టిని సేకరించరాదు.
- పొలంలో వాలు ఎక్కువగా ఉన్నపుడు, దానిని ఎత్తు, పల్లపు





ప్రాంతాలుగా విభజించి వేరు వేరుగా మట్టి నమూనాలను సేకరించాలి. అటువంటి సందర్భాల్లో కూడా, పైన తెలిపిన జాగ్రత్తలు పాటించాలి.

- పొలంలో అక్కడక్కడ చౌడు ప్రాంతంగా ఉన్నట్లు అనుమానం కలిగితే అక్కడి నుంచి ప్రత్యేకంగా నమూనాను తీసి వేరుగా చౌడు లక్షణాల పరీక్ష కోసం పంపాలి. అంతేగాని, అటువంటి మట్టిని బాగా ఉన్న ఇతర ప్రాంతపు మట్టితో కలుపరాదు.
- పండ్ల తోటలకు అనువైన నేలలను గుర్తించినప్పుడు గాని, పండ్ల చెట్లకు ఏవైనా పోషక పదార్థాలు, ఇతర సమస్యల గుర్తింపు కోసం మట్టి నమూనాలను ఈ క్రింది విధంగా తీసుకోవాలి.
- సాధారణంగా పంటను బట్టి 3 నుండి 6 అడుగుల (1-2 మీ) లోతు గుంట త్రవ్వి, ప్రతి అడుగుకు కొంత మట్టిని (నమూనా) సేకరించి, భూసార పరీక్షకు పంపాలి.
- మట్టి నమూనాను తీసేటపుడు క్రింది లోతు నుండి మొదటి మట్టి నమూనా తీయాలి. ఆ తరువాత పైపొరల నుండి మట్టిని సేకరిస్తే పై మట్టి క్రింది మట్టితో కలువదు.
- మట్టి నమూనా కోసం గుంట తవ్వుతున్నపుడు ఏవైనా గట్టి పొరలు ఉంటే వాటి లోతు, వాటి లక్షణాల గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి.
- పండ్ల తోటల విషయంలో ఇలాంటి నమూనా సేకరణ ఎకరాకు 2-4 చోట్ల నుంచి వస్తే చాలా మంచిది.
- ఇటువంటి నమూనాలను పరీక్ష కోసం పంపేటపుడు "పండ్ల తోటలకు అనువైన పరీక్షల కోసం" అని తెలియచేయాలి.
- పొలంలో పలు ప్రాంతాల (8-10 చోట్ల) నుండి సేకరించిన మట్టిని లేదా పండ్ల తోట కోసం తీసిన మట్టిని గాని, కలిపేందుకు యూరియా లేక ఇతర ఎరువుల సంచులను వాడరాదు. ఇందు కోసం శుభ్రమైన ప్లాస్టిక్ షీటును ఉపయోగించడం మంచిది.
- ఈ విధంగా సేకరించిన మట్టిని బాగా నీడలో గాలికి ఆరిన తరువాత మంచి ప్లాస్టిక్ బ్యాగులో గాని, గుడ్డ సంచిలో గాని నింపి, తమకు సమీపంలోని వ్యవసాయ శాఖకు సంబంధించిన భూసార పరీక్ష కేంద్రానికి ఈ క్రింది సమాచారంతో పంపాలి.

1. రైతు పేరు, సర్వే నెంబరు, గ్రామం, మండలం
2. కావలసిన పరీక్ష (భూసార/చౌడు/పండ్లతోట ఎంపికకు)
3. ఇంతకు మునుపు పంట, దానికి వాడిన ఎరువులు
4. వేయబోవు పంట

సాధారణంగా రైతులు కాగితంలో పైన తెలిపిన విషయాలు రాసి మట్టి నమూనాతోపాటు సంచిలో వేసి భూసార పరీక్ష కేంద్రానికి పంపుతుంటారు. దీనితోపాటు, మరొక కాగితంపై ఇదే విషయాలు రాసి పైన జత చేసి పంపితే బాగుంటుంది. వివరాలను రాయటానికి పెన్సిల్‌ను ఉపయోగిస్తే చాలు.

**భూసార (మట్టి) పరీక్ష ఉపయోగాలు :**

- భూమిలో నత్రజని, భాస్వరం, పోటాష్ ల స్థాయిలను తెలుసుకోవచ్చు.
- ఆమ్ల, క్షార భూములను గుర్తించవచ్చు.
- నేల భౌతిక, రసాయనిక లక్షణాలను తెలుసుకోవచ్చు.
- భూసార పరీక్షల ద్వారా నేలలోని సూక్ష్మ పోషక పోషకాల స్థాయిని కూడా తెలుసుకోవచ్చు.
- ఎరువుల వినియోగం పై అనవసర ఖర్చులను తగ్గించవచ్చు.
- సమతుల ఎరువుల వాడకం భూసార పరీక్షల వల్ల మాత్రమే సాధ్యపడుతుంది.
- పంట ఆధారంగా సిఫారసు చేసిన ఎరువులను వాడవచ్చు.
- సేంద్రియ ఎరువుల మోతాదును కూడా సూచించవచ్చు.
- చౌడు భూములను, ఆమ్ల భూములను పునరుద్ధరించే యాజమాన్య పద్ధతులను కూడా సూచించవచ్చు.

# పచ్చిరొట్ట భూసారానికి రక్ష

సి.యమున, శాస్త్రవేత్త,
డాక్టరు ఎన్. ప్రవీణ్, ప్రిన్సిపల్ సైంటిస్టు,
డిఏఏటిటిసి, తాండూరు

ప్రస్తుతానికి అధిక దిగుబడులు సాధించడమే కాకుండా భవిష్యత్తులో పది కాలాలపాటు నేల ఆరోగ్యాన్ని అంటే భౌతిక రసాయనిక, జీవ సంబంధమైన వాతావరణాన్ని కాపాడాల్సిన బాధ్యత మనందరిపైనా వుంది. అంతేగాక, సహజవనరులైన నేల, నీరు, వ్యవసాయ ఉత్పత్తులు కాపాడాలన్నా సేంద్రీయ వ్యవసాయ పద్ధతులపై దృష్టి సారించాల్సిన అవసరం ఉంది. అందులో భాగమే పచ్చిరొట్ట ఎరువులను వాడటం. ేటి రైతాంగానికి సేంద్రియ ఎరువైన పశువుల ఎరువు కొరత ారణంగా కేవలం రసాయన ఎరువులను వాడుతున్నారు. దీని ూలంగా పోషక పదార్థాల సమతుల్యత దెబ్బతినడంతోపాటు ధికంగా చీడపీడలు ఆశించడం, సూక్ష్మ పోషకాలు తగ్గడంతోపాటు గుబడులు గణనీయంగా తగ్గిపోతున్నాయి. ఈ నేపథ్యంలో మనం వలం రసాయనిక ఎరువులనే కాకుండా అందుబాటులో ఉన్న అన్ని ాల పోషక వనరులను ఉపయోగించు కోవాల్సిన అవసరం ్పడింది.

నేలకు తగిన సేంద్రియ పదార్థం అందించడానికి పచ్చిరొట్ట ువుల వాడకం సులువైన, చవకైన పద్ధతి. పచ్చి రొట్ట ఎరువులు టే ఎరువు కోసం ఒక పైరును ప్రత్యేకంగా పెంచి పూత వచ్చే లో భూమిని కలియదున్నడం. పచ్చి ఆకు ఎరువు అంటే బంజర ములలో పెరిగే చెట్ల ఆకులు, కొమ్మలు తెచ్చి పొలంలో వేసి ుదున్నడం. నేలకు సత్తువను చేకూర్చే పంటలు గాని, అటువంటి ాలున్న పైరుల ఆకులను పచ్చిరొట్ట ఎరువులుగా వాడాలి. ారణంగా లెగ్యూమ్ జాతికి చెందిన పైర్లు పచ్చి రొట్టకు బాగా వస్తాయి. వీటిలో జీలుగ, జనుము, అలసంద, పిల్లిపెసర, లి, ఉలవ పైర్లు ముఖ్యమైనవి. ఈ పైర్ల విత్తనాలను నేలలో ల్లి పూత దశలో నేలలో కలియదున్ని వారం పది రోజుల తర్వాత విత్తుకోవచ్చు.

### పచ్చిరొట్ట పైర్లుగా ఎంపిక చేసుకొనే వాటికి ఉండాల్సిన లక్షణాలు

1. పచ్చిరొట్ట పైరు తక్కువ రోజుల్లో పెరిగి ఎక్కువ రొట్ట నివ్వాలి
2. పప్పు జాతికి చెందిన మొక్కలయితే గాలిలోని నత్రజనిని వేర్లపైన బొడిపెలలో స్థిరీకరిస్తాయి.
3. త్వరగా పెరిగి కలుపు మొక్కల పెరుగుదలను అరికట్టేదిగా ఉండాలి.
4. అన్ని నేలల్లో ఎదిగేదిగా ఉండాలి
5. నేలలో కలియదున్నినప్పుడు త్వరగా కుళ్లిపోయే స్వభావం కలిగేదిగా ఉండాలి
6. ఎక్కువ ఆకు ఇచ్చేదిగానూ, తక్కువ నీటితో కూడా పెరిగేదిగానూ ఉండాలి.

### పచ్చిరొట్ట ఎరువుల వాడకం వల్ల కలిగే లాభాలు

1. సమగ్ర సమతల పోషక యాజమాన్యం, భూసార పరిరక్షణతోపాటు భూసారం పెరుగుతుంది.
2. రసాయనిక ఎరువులు సమర్థవంతంగా వినియోగించబడతాయి.
3. భూ సమస్యలైన ఆమ్లత్వం లేదా క్షారత్వాన్ని తగ్గించి నేలలను తటస్థ స్థితికి తెస్తాయి.
4. నేల కోతను అరికట్టడంతోపాటు నీటిని నిలుపుకునే శక్తిని మెరుగుపరుస్తాయి.
5. నేలలో ఉండే సూక్ష్మ జీవుల సంతతి అభివృద్ధి చెంది భూసారాన్ని పరిరక్షించడంతోపాటు నేల భౌతిక, రసాయనిక వాతావరణాన్ని కూడా మొక్కకు అనుకూలంగా మార్చుతాయి.



వరి నాటుటకు ముందు పచ్చి రొట్ట పంట (పెసలు) సాగు



6. ముఖ్యంగా కలుపు ఉధృతిని తగ్గించడంతోపాటు చీడపీడల బెడద కూడా తగ్గుతుంది.
7. నత్రజని ఎరువుల వినియోగంలో 20-30 శాతం ఆదాతోపాటు సూక్ష్మ పోషకాలు కూడా మొక్కకు అందుతాయి.

### వివిధ రకాల పచ్చిరొట్ట పైర్లు

పచ్చిరొట్ట పైర్లుగా అధికంగా వినియోగించే జనుము, జీలుగనేగాక కొంత ఆదాయం అందించే పచ్చిరొట్టగా పెసర, మినుము, అలసంద మొదలైన పైర్లను విత్తుకోవచ్చు. జనుము చాలా త్వరగా అంటే నాటిన 45 రోజుల్లో 8-10 టన్నుల వరకు ఎకరానికి పచ్చిరొట్ట వస్తుంది. ఎకరానికి- 18-20 కిలోల విత్తనం అవసరం. జీలుగ పైరు 50-55 రోజుల్లో 10-12 టన్నుల పచ్చిరొట్ట వస్తుంది. ఎకరానికి 20-25 కిలోల విత్తనం అవసరమవుతుంది. ఒక వేళ పరిస్థితులు అనుకూలిస్తే పెసర, మినుము వంటి పైర్లను వరికి ముందుగా సాగు చేసి, పచ్చిరొట్ట ఎరువుగాని లేదా ఒక కోత కాయ తీసిన తర్వాత పచ్చి రొట్టగా భూమిలో కలియదున్నుకోవచ్చు. పెసర, మినుము పైర్లు ఎకరానికి 6-8 కిలోల విత్తనం అవసరం అవుతుంది. అనుకూల పరిస్థితుల్లో ఎకరానికి 3-4 క్వింటాళ్ల పెసర దిగుబడి వస్తుంది. బీడు లేదా బంజరు భూముల్లో పెరిగే వేప, గానుగ, గ్లెరిసిడియ, జిల్లేడు, మెపలి మొక్కల లేత ఆకులను, కొమ్మలను కత్తిరించి ఎకరానికి సుమారు 2-3 టన్నుల వరకూ పచ్చిరొట్ట తెచ్చుకొని పొలంలో వేసి కలియ




దున్నవచ్చు. పచ్చిరొట్ట పైరుగాని, ఆకుగాని, భూమిలో వేసి కలియదున్నే సమయంలో ఎకరానికి 50 కిలోల సింగిల్ సూపర్ ఫాస్ఫేట్ ఎరువు జల్లి కలియదున్నితే మంచిగా కుళ్లి సేంద్రియ పదార్థం భూమికి చేరుతుంది.

### పచ్చిరొట్ట పైర్లలోని పోషకాల మోతాదు

సగటున వివిధ పచ్చిరొట్ట పైర్లు ఒక ఎకరానికి 4-6 కిలోల నత్రజని, 2 కిలోల భాస్వరం, 5,6 కిలోల పొటాషియాన్ని అందిస్తాయి. వీటితోపాటు తక్కువ మోతాదులో సూక్ష్మ పోషకాలు కూడా భూమికి చేరుతాయి. వీటి ద్వారా భూమి సారవంతమవడమేగాక, భూమిలోని పోషక పదార్థాల లోపాలను కూడా సవరించవచ్చు.

### పచ్చిరొట్ట పైర్లను ఎప్పుడు సాగు చేసుకోవాలి?

పచ్చిరొట్ట పైర్లను తొలకరి వర్షాలు మొదలైనప్పుడు ఖరీఫ్ సీజనుకు ముందగా లేదా ఖరీఫ్, రబీ మధ్యలోగాని వేసుకోవచ్చు. దున్నిన నేలలో వీటిని వెదజల్లుకోవాలి. సాధారణంగా 45 రోజులు సమయంలో అంటే పూత దశలో వీటిని కలియదున్నుకోవాలి. వర్షం నీటిని వృధ చేసుకోకుండా నీరు చేరిన వెంటనే సుమారు ఒక అర అడుగు లోపలి వీటిని దున్నుకోవాలి. నేలలో కలియదున్నే సమయంలో ఎకరాని ఒక బస్తా సూపర్ ఫాస్ఫేట్ ఎరువు వేసుకుంటే సూక్ష్మ జీవుల చ త్వరత్వరగా జరిగి రొట్ట చివికి కావలిసిన పోషకాలను త్వరగా పంట అందిస్తుంది. రొట్ట కలియదున్నిన వెంటనే చాలా మంది రైతు పైరు నాటుతుంటారు. అయితే ఇది మంచి పద్ధతికాదు. పచ్చిరొ పైర్లు నేలలో కలియదున్నిన తర్వాత రెండు వారాల పాటు నీటి మరగనివ్వాలి. ఈ సమయంలో కొన్ని హానికరమైన సేంద్రియ ఆమ్లా తయారవుతాయి. కనుక మురుగునీరు తీసివేసి కొత్త నీరు పె తర్వాతే పైరు నాటాలి. ఈ పచ్చిరొట్ట పైర్లు పెరగడానికి తగినం తేమ, నేలలో కలియ దున్నిన తరువాత మురగడానికి తగిన నీటి వసతి ఉండాలి. ఇటువంటి సదుపాయం లేనివాళ్లే వీ ప్రత్యామ్నాయంగా పచ్చి ఆకు ఎరువులను వాడుకోవాలి. ప్రయోజనాలు ఉన్న పచ్చిరొట్ట ఎరువుల వాడకం ప్ర వ్యవసాయంలో తప్పనిసరి అని రైతు గ్రహించాలి. వ్యవసాయం నేడుండి రేపు పోయేది కాదు. భూగోళం మీద మను వున్నంతకాలం ఉంటుంది.

# మామిడిలో పండు ఈగ బెడద నివారణా మార్గాలు







కె. సరిత, శాస్త్రవేత్త, (హార్టికల్చర్)
కె. రాహుల్ విశ్వకర్మ, (ఎంటోమాలజీ) కో-ఆర్డినేటర్,
డిఎఎటిటిసి, సంగుపేట్, సంగారెడ్డి
ఫోన్లు 7013192530, 9848352655


మామిడి తోటలు విస్తీర్ణంలో ఉభయ తెలుగు రాష్ట్రాలదే అగ్రస్థానం. మన దేశ మామిడి ఉత్పత్తిలో సుమారు 24 శాతం వాటా మన తెలుగు రాష్ట్రాలదే. విదేశీ మార్కెట్‌లో మన మామిడికి మంచి డిమాండ్ ఉంది. మామిడి సాగులో చీడపీడల బెడద ప్రధాన సమస్య. కొత్త చిగురు వచ్చే దశ నుంచి కాయ కోత దశ వరకూ.. మామిడి తోటలను ఎన్నో రకాల తెగుళ్ళు, పురుగులు ఆశించినా, పంటకు నేరుగా నష్టం చేసే చీడలు మాత్రం రైతుకు ఎంతో ఆవేదనకు గురి చేస్తాయి. అలాంటిదే పండు ఈగ. ఇటీవల కాలంలో పండుఈగ బెడద బాగా పెరిగింది. పండు ఈగ బెడద వల్ల సుమారు 50 నుంచి 60 శాతం పంట నష్టం ఉంటోంది. కాయ దిగుబడిని, నాణ్యతకు కూడా నష్టం చేకూర్చి ఎగుమతుల పైన కూడా ప్రభావం చూపుతోంది. ఈ పండు ఈగ నష్టాన్ని మామిడితోపాటు జామ, రేగు, సపోట, బొప్పాయి వంటి ఇతర పండ్ల తోటల్లో ఈ మధ్యకాలంలో ఎక్కువగా గమనించడం జరిగింది. పండు ఈగ నష్టాన్ని రైతులు ముందుగానే గుర్తించి తగిన నివారణ చర్యలు తీసుకుంటే కాయ నాణ్యత పెరిగి, అధిక దిగుబడులు సాధించడానికి ఆస్కారం వుంటుంది.

## పండు ఈగ కలిగించే నష్టం

పండు ఈగ తల్లి పురుగులు గోధుమ రంగులో పారదర్శకమైన రెక్కలు కలిగి ఉంటాయి. ఇవి పక్వానికి వచ్చిన మామిడి కాయ చర్మంలోనికి పదునైన వెనుక భాగాన్ని చొప్పించి, కాయ చర్మం లోపల గుడ్లు పెడతాయి. గుడ్లు పెట్టిన చోట సన్నని రంధ్రాలు ఏర్పడతాయి. ఈ రంధ్రాలు చాలా సూక్ష్మంగా ఉండి పరిశీలనగా చూస్తేనేగాని కనపడవు. పండు ఈగ గుడ్లు తెలుపు లేదా లేత పసుపు రంగులో వుండి చాలా చిన్నవిగా ఉంటాయి. సాధారణ ఉష్ణోగ్రతలో గుడ్లు ఒక్క రోజులోనే పగిలి చిన్న పిల్లల్లా పురుగులు బయటకు వస్తాయి. ఇవి తెలుపు లేదా లేత పసుపు రంగులో ఉండి కాయలోనే పక్వానికి వచ్చే తీపి కండ పదార్థాలను తిని పెద్దవిగా తయారవుతాయి. ఈ క్రమంలో అవి విసర్జించిన మలిన పదార్థాలు, గుడ్లు పెట్టడానికి, కాయపైన చేసిన చిన్న రంధ్రాల ద్వారా శిలీంద్రాలు ప్రవేశించి కాయలు కుళ్లి మెత్తబడతాయి. గుడ్డులో నుంచి వచ్చిన చిన్న లార్వాలు 6 నుంచి 35 రోజుల్లో పెద్ద లార్వాలుగా తయారవుతాయి. ఉష్ణోగ్రతలు ఎక్కువగా ఉన్న ప్రాంతాల్లో త్వరగా లార్వాలు వృద్ధి చెందుతాయి. పండులో పూర్తిగా తయారయిన లార్వాలు, కోశస్థ దశగా మారేందుకు పండు నుండి నేలలోనికి చేరతాయి.

ఇవి లేత పసుపు రంగు లేదా ముదురు గోధుమ రంగులో వుంటాయి. 10-12 రోజుల్లో ఇవి తిరిగి ఈగగా మారతాయి. ఆ తరువాత ఆడ, మగ ఈగలు సంపర్కం చెంది మళ్లీ గుడ్లు పెడతాయి. జీవిత చక్రం ప్రారంభిస్తాయి. రైతులు మామిడి కాయలను ఎప్పటికప్పుడు నిశితంగా పరిశీలిస్తూ ఉండాలి. కాయలు మెత్త బడుతున్నా, కాయలు తయారు కాకుండానే రాలి పడుతున్నా, పండు ఈగ ఆశించిందని గుర్తించాలి. ఈగలు గుడ్లు పెట్టిన సన్నని రంధ్రాలు కలిగిన కాయలను గమనించి వాటిని వేరుచేసి నాశనం చేయాలి.



### నివారణా చర్యలు

- చెట్టు కింద నేలను తవ్వి కోశస్థ దశలను బయట పడేలా చేయాలి
- పండు ఈగ ఉధృతిని బట్టి ప్రతి 10 లేదా 20 మామిడి చెట్లకు ఒక మిథైల్ యూజనాల్ ఎరను ఉంచాలి
- లేకపోతే 10 మిల్లీ లీటర్ల మిథైల్ యూజనాల్‌ను 200 మిల్లీలీటర్ల నీటిలో కలిపిన ద్రావణాన్ని ప్లాస్టిక్ పళ్లెంలో లేదా మట్టి పళ్లాల్లో పోసి ఉంచితే ఈ ఎర ద్రావణానికి మగ ఈగలు ఆకర్షించబడతాయి. ఈ ఎర మంచు ద్రావణంలో ఏదైనా పురుగు మందును కలిపితే ఈగలు మందు ఎరను తాగి చనిపోతాయి.

మామిడిని ఎగుమతి చేసే రైతులు.. మామిడిని పూర్తిగా పక్వానికి రాకముందే కోస్తే.. పండు ఈగ బారిన పడకుండా కాపాడుకోవచ్చు. మామిడి కాయలను చీడపీడల బారిన పడకుండా కాపాడుకునే అత్యంత శ్రేష్ఠమైన విధానం బ్యాగులు కట్టడం. ఈ మామిడి కాయలను నిమ్మకాయ అంత దశలో ఉండగానే గ్రో కవర్‌లను కట్టుకుంటే పండు ఈగ బెడదతోపాటు తామర పురుగులు, కాయితాల పురుగుల నుంచి కూడా రక్షణ కల్పించవచ్చు. మామిడి కాయలను ఎగుమతి చేసేటప్పుడు వాటిలోని గుడ్లు, పిల్ల పురుగులు దశలను నాశనం చేయడానికి 48 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత కలిగిన వేడినీటిలో కాయలను 60 నుంచి 70 నిమిషాలు ఉంచాలి. ముందస్తు రుతుపవనాలు వచ్చి వర్షాలు కురిసే పరిస్థితుల్లో పండు ఈగ ఉధృతి ఎక్కువగా ఉంటుంది. ముందునుంచే జాగ్రత్తలు తీసుకుంటే ఈ పండు ఈగ బెడదను తగ్గించి మంచి దిగుబడులు తర్వారా ఆదాయం పొందవచ్చు.

---

**కొమ్మారెడ్డి 82 వర్ధంతి నివాళి**

# రైతాంగ ఉద్యమాలకు స్ఫూర్తి కొమ్మారెడ్డి పోరాట జీవితం

**- కె. శ్రీనివాస్,**

అవిశ్రాంత రైతాంగ పోరాట యోధుడు అమరజీవి కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి పశ్చిమ గోదావరి జిల్లా (ప్రస్తుతం ఏలూరు జిల్లా) దెందులూరు మండలం పోతునూరులో 1901లో జన్మించారు. గాంధీజీ పిలుపునందుకుని చదువుకు స్వస్తి చెప్పి 1919-21 సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనడం ద్వారా దేశ స్వాతంత్ర్య సమరంలోకి ఉరికారు. 1930లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని రాజమండ్రి, నెల్లూరు జైళ్లలో ఒక ఏడాది కఠిన శిక్ష అనుభవించారు. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం 1931లో పన్నులు పెంచుతూ రీసెటిల్‌మెంట్ పన్ను వేసింది. రీసెటిల్‌మెంట్‌కు వ్యతిరేకంగా పశ్చిమ గోదావరి జిల్లాలో జరిగిన ఉద్యమానికి దండు నారాయణరాజు, కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, ఉద్దరాజు రామం, మాగంటి బాపినీడు వంటి స్వాతంత్ర్య సమరయోధులు నాయకత్వం వహించారు. ఈ ఉద్యమంలో కొమ్మారెడ్డి అరెస్టయి జైలుశిక్ష అనుభవించారు. 1934లో విశాఖలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర రైతు మహాసభలో రైతుసంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు. 1937లో ఇచ్ఛాపురం నుండి తడ వరకు చారిత్రాత్మక రైతు రక్షణ యాత్ర నిర్వహించారు. రైతు రుణ విమోచన, జమీందారీ విధానం రద్దు వంటి ప్రధానమైన నినాదాలతో 130 రోజులపాటు ఈ పాదయాత్ర సాగింది. ఈ యాత్రకు కొమ్మారెడ్డితో పాటు చలసాని వాసుదేవరావు నాయకత్వం వహించారు. 2054 మైళ్ళు ప్రయాణించి 1938 మార్చి 27న మద్రాస్ కు చేరుకుంది.



ఈ రైతు రక్షణ యాత్ర భారతదేశ రైతాంగం ఉద్యమంలో విశిష్టత కలిగినది. ఆ తర్వాత జరిగిన జమీందారి వ్యతిరేక పోరాటాలలో కొమ్మారెడ్డి ముందుండి స్ఫూర్తిదాయక పాత్ర నిర్వహించారు. తన ఇంట్లో ఉన్న అప్పుల ప్రామిసరీ నోట్లు తగులబెట్టి రైతుల్ని రుణ విముక్తుల్ని చేసి ఆదర్శంగా నిలిచారు. స్వాతంత్ర్యోద్యమంలో అంతర్భాగంగా జరిగిన భూస్వామ్య వ్యతిరేక పోరాటంలో ప్రముఖ పాత్ర వహించారు. స్వాతంత్ర్య సాధనతో పాటు దేశంలో దారిద్ర్యం, ఆర్థిక, సాంఘిక అసమానతలు పోయి సమసమాజం రావాలని భావించారు. సోషలిజం ఆశయాలకు ప్రభావితమై రైతులు, కార్మికుల ఐక్యత కోసం కృషి చేసిన ఆయన తన 39వ ఏట 1940 ఏప్రిల్ 19న మరణించారు. కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి జీవితం నేటి రైతాంగ ఉద్యమాలకు స్ఫూర్తిదాయకం, ఆదర్శప్రాయం.

**(ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం రాష్ట్ర సహాయ కార్యదర్శి)**




# సేంద్రియ జీవన ఎరువుల వాడకం - ఉపయోగాలు

ఎన్. గౌరీప్రియ,
వ్యవసాయ విస్తరణాధికారిణి, రంగారెడ్డి జిల్లా
సి.యమున, శాస్త్రవేత్త,
డిఏఏటిటిసి, తాండూరు

వివిధ పంటల్లో అధిక దిగుబడి సాధించాలన్నా, నేల నాణ్యతను పెంచాలన్నా, పంటలకు చీడ, పీడల వ్యధను తగ్గించాలన్నా సేంద్రియ ఎరువుల వాడకం ఎంతో అవసరం. మొక్కలు, జంతువులు, మానవ అవశేషాలు, విసర్జితాల నుండి తయారయ్యే ఎరువులను మనం సేంద్రియ ఎరువులుగా పరిగణిస్తాము.

ఈ సేంద్రియ ఎరువులు మొక్కలకు కావలసిన స్థూల పోషకాలతో పాటు, సూక్ష్మ పోషకాలైన ఇనుము, మాంగనీసు, జింకు, మాలిబ్డినమ్, రాగి, బోరాన్ మొదలగు అన్నిటిని అందిస్తాయి.

వివిధ రకాలకు సంబంధించిన సేంద్రియ పదార్థాలు, సేంద్రియ ఎరువులు నేలలో కుళ్లి మొక్కకు కావలసిన పోషకాలను అందిస్తాయి. నేలలో ఉండే బాక్టీరియా, శిలీంద్రాలు, యాక్టినోమైసిటీస్ వంటి సూక్ష్మజీవులు విడుదల చేసే వివిధ రకాల ఎంజైములు సేంద్రియ పదార్థాలను కుళ్లింప చేయడంలో తోడ్పడతాయి. ఈ ఎంజైములు సేంద్రియ పదార్థంలోని ప్రోటీన్లు, పిండిపదార్థాలను త్వరగా కుళ్లింప చేయడంలో ప్రధాన పాత్ర పోషిస్తాయి. లిగ్నిన్, సెల్యూలోజ్, హెమి సెల్యూలోజ్‌లు నెమ్మదిగా కుళ్లుతాయి. ఇవి నేలలో కుళ్లి హ్యూమస్ అనే సేంద్రియ పదార్థంగా తయారవుతాయి.



ఈ సేంద్రియ ఎరువులతోపాటు జీవన ఎరువుల ప్రాముఖ్యం కూడా పంటను అభివృద్ధి చేయడంలో ఎంతో తోడ్పడతాయి. ఈ జీవన ఎరువులు పంట పెరుగుదలకు కావలసిన పోషకాలను అందించే సూక్ష్మాతి సూక్ష్మ జీవ కణాలు. అందులో నత్రజనిని స్థిరీకరించేవి, భాస్వరాన్ని అందించే జీవన ఎరువులు మొక్క పెరుగుదలలో ముఖ్య పాత్ర వహిస్తాయి.

- నత్రజనిని స్థిరీకరించే జీవన ఎరువులను వేరుశనగ, వరి, అపరాలలో ఎక్కువగా ఉపయోగిస్తారు. 200 గ్రాముల రైజోబియం జీవన ఎరువును 50 గ్రాముల బెల్లం ద్రావణంలో వేసి విత్తనశుద్ధి చేసి వాడుకోవాలి.

**ఉదాహరణకు :** కంది, పెసర, మినుములు, అలసందలు.

- అజొల్లాను వరి పంటలో ఉపయోగిస్తారు. వరి నాటిన

వారం రోజులకు ఎకరానికి 100 కిలోల అజొల్లాను వేసుకోవాలి. మూడు వారాలకు అజొల్లా వరి పొలంలో పెరిగి కుళ్లి మొక్కలకు కావలసిన నత్రజనిని స్థిరీకరిస్తాయి.

**ఉదాహరణకు :** వరిలో ఎక్కువ ఉపయోగిస్తారు.

- నీలి ఆకుపచ్చ శైవలాల నాటు పొడిని వరిలో ఎకరానికి నాలుగు కిలోలు చల్లాలి. దీని నుండి వారం రోజుల్లో ఎంజైములు ఉత్పత్తి అయ్యి మొక్క వేళ్లకు తగినంత ఆక్సిజన్ లభ్యం అయ్యేలా చేస్తుంది.

**ఉదాహరణకు :** వరి

- అదేవిధంగా అజటోబాక్టర్, అజోస్పైరిల్లంలను ఒక కిలో పొడిని 20 కిలోల పశువుల ఎరువుతో కలిపి చల్లుకోవాలి.

**ఉదాహరణకు :** గోధుమ,జొన్న, మొక్కజొన్న, వరి, పత్తి, కూరగాయలు, నువ్వులు.

- భాస్వరాన్ని స్థిరీకరించే ఫాస్ఫోబాక్టీరియా జీవన ఎరువు ఉత్పత్తి చేసే సేంద్రియ ఆమ్లాల వల్ల భూమిలో లభ్యంకాని స్థితిలోగల భాస్వరాన్ని మొక్కకు అందించి మొక్క పెరుగుదలకు ఉపయోగపడే హార్మోన్లను ఉత్పత్తి చేస్తుంది. ఒక కిలో ఫాస్ఫోబాక్టీరియాను 20 కిలోల పశువుల ఎరువతో కలిసి ఎకరానికి దుక్కిలో చల్లుకోవాలి.

## సేంద్రియ ఎరువుల వాడకం వల్ల కలిగే లాభాలు

- రసాయనిక ఎరువులు సిఫారసు వాడకంలో మార్పులు జిగితే పంటలో కలిగే తెగుళ్లు, సూక్ష్మ లోపాలు వంటివి సేంద్రియ ఎరువుల వాడకంలో ఉండదు.
- ఇవి వాడటం వల్ల నేలలో సూక్ష్మ జీవుల సాంద్రత పెరిగి నేల సారవంతం అవడమే కాకుండా మొక్కకు కావలసిన 16 రకాల పోషకాలు అందుతాయి.
- సేంద్రియ ఎరువులైన వర్మి కంపోస్టు, కంపోస్టు, కోళ్ల ఎరువు, జీవన ఎరవులు, పచ్చిరొట్టపైర్ల వల్ల అధిక దిగుబడులు సాధించగలము. ఇవి భూమిని గుల్ల బార్చి నీరు, పోషకాలు మొక్కకు అందేలా తోడ్పడతాయి.
- వీటివల్ల నేల భౌతిక స్థితి మెరుగుపడి మొక్క పోషకాలను గ్రహించడానికి అవసరం అయ్యే సూక్ష్మ జీవుల వృద్ధికి సహాయ పడతాయి.
- పంట నాణ్యతను పెంచుతాయి
- కారు చౌడు, పాల చౌడు నేలలు ఏర్పడకుండా నేలలను రక్షించవచ్చు.
- పర్యావరణ కాలుష్యాన్ని తగ్గించవచ్చు
- చీడపీడల తాకిడిని తగ్గించుకొని అధిక దిగుబడుల పొందవచ్చు



| జీవన ఎరువులు | ఉపయోగించు పంటలు | నత్రజని స్థిరీకరణ |
|---|---|---|
| రైజోబియం (సింబయాటిక్) | పప్పుదినుసుల పంటలు | హెక్టారుకు 30-50 కిలోల నత్రజని స్థిరం. 5 శాతం దిగుబడి పెరుగుదల |
| అజటోబాక్టర్ (నాన్ సింబయాటిక్) | వరి, గోధుమ, మొక్కజొన్న జొన్న, పత్తి, చెరకు. మొ॥లగు | 20-40 కిలోల నత్రజని స్థిరీకరణ 10-15శాతం దిగుబడి పెరుగుదల |
| అజోస్పైరిల్లం | జొన్న, సజ్జ, వరి, కూరగాయలు | 20-40 కిలోల నత్రజని పెరుగుదల 10-15 శాతం దిగుబడి పెరుగుతుంది |
| నీలి ఆకుపచ్చ శైవలం | వరి | 20-30కిలోల నత్రజని స్థిరీకరణ |
| అజొల్లా | వరి | 40 - 60 కిలోల నత్రజని స్థిరీకరణ |

విజయ గాథ

# బంతి సాగుతో లాభాల బాట..


కె. సరిత, శాస్త్రవేత్త,
కె. రాహుల్ విశ్వకర్మ, కో-ఆర్డినేటర్,
డిఏఏటిటిసి, సంగుపేట్, సంగారెడ్డి
ఫోన్లు 7013192530, 9848352655


వ్యవసాయం చేస్తున్న తండ్రికి గ్యాడ్యుయేట్ అయిన ఆ బిడ్డ చేదోడు వాదోడుగా సాయపడుతున్నాడు. అయితే అతివృష్టి, అనావృష్టి వంటి ఇబ్బందులతో ఆ రైతు కుటుంబం సాగులో వరుసగా నష్టాలను మూటగట్టుకుంది. దీంతో ప్రత్యామ్నాయ పంటలవైపు వెళ్తే తప్ప లాభం లేదనుకున్నాడు ఆ గ్రాడ్యుయేట్ కుమారుడు. ఉద్యాన అధికారుల సలహాతో ఎప్పుడూ చేస్తున్న సాగుకు భిన్నమైన పైర్లు సాగు చేపట్టి లాభాల బాటలోకి తీసుకువెళ్లాడు. ఈ సాగులో విజయం పొందిన ఆ గ్రాడ్యుయేట్ యువకుడే ముచ్చర్ల శ్రీకాంత్.

శ్రీకాంత్ ఊరు ముచ్చర్ల. సంగారెడ్డి జిల్లాలోని హత్నూర మండలంలో ఉంది. స్వతహాగా రైతు బిడ్డ అయిన ఆయన.. వ్యవసాయం మీద మక్కువతో తన తండ్రికి చేదోడువాదోడుగా సాగుకు సాయపడుతున్నాడు. సంప్రదాయ పంటలైన వరి, కంది, మొక్కజొన్న పంటలలో రైతుకు తుక్కువ నికరాదాయం రావడం, పైగా అతివృష్టి, అనావృష్టులతో పంట నష్టాలు పాలుగావడం జరుగుతోంది. ఇలా వరుసగా నష్టాలు వస్తూండటంతో ఉద్యాన పంటలపై మొగ్గు చూపాడు. ఉద్యాన అధికారుల సహకారంతో చలువ పందిళ్లను సబ్సిడీ రూపంలో పొందాడు. ఈ చలువ పందిరి కింద టమాట, కీర, మిర్చిని సాగు చేయడం ప్రారంభించి రెండేళ్లపాటు మంచి లాభాలను పొందాడు. ఆ తరువాత సంవత్సరాల్లో టమాట నులిపురుగుల బారినపడి మొక్కలు వాడిపోవడం, దిగుబడి తగ్గడం గమనించాడు. అదే సమయంలో ఏరువాక కేంద్రం, సంగుపేట శాస్త్రవేత్తల సహకారంతో అదే నేలలో బంతి సాగు చేపట్టి మంచి లాభాలు తీసుకున్నాడు.

ఈ రైతు తనకున్న చలువపందిరి కింద 2,600 బంతి మొక్కల (ప్రైవేట్ హైబ్రిడ్)ను ఆగస్టు నెలలో నాటుకొని దసరా, దీపావళి పండుగకు (అక్టోబరు, నవంబరు నెలల్లో) వచ్చే విధంగా పంటను వేసుకున్నారు. ఈ మొక్కలను ప్రైవేట్ నర్సరీ నుండి మొక్క రూ.3 చొప్పున కొనుగోలు చేసి తెచ్చాడు. 20 రోజుల వయస్సు కలిగిన నారు మొక్కలను ప్రధాన పొలంలో, 60 రోజుల (దసరా పండుగ) ముందు నాటుకున్నారు.

దీనికి ముందు నేలను బాగా దున్ని, ఇందులో 5 టన్నుల పశువుల ఎరువుతోపాటు వేపపిండి, 50 కిలోలు వేశాడు. ఆఖరి దుక్కిలో భాస్వరం 100 కిలోలు, పొటాష్ 20 కిలోలు, నత్రజని 10 కిలోల చొప్పున పొలం మొత్తం వెదజల్లాడు. ఆ తరువాత బోదెలు చేశాడు. డ్రిప్‌ను పరిచి, పాలిథిన్ మల్చింగ్‌ను వేసుకొని, మొక్కలను 90×45 సెంటీమీటర్ల దూరంలో నాటాడు.

క్రమం తప్పకుండా డ్రిప్ ద్వారా నీటిని అందిస్తూ మొక్క నీటి ఎద్దడికి గురికాకుండా చూసుకున్నాడు. డ్రిప్ పద్ధతి ద్వారా ఎరువులను అందించాడు. ప్రతి రెండు రోజులకు ఒకసారి 19 : 19 : 19 రెండు కిలోలను, 13-0-45 ఒక కిలోని వారం రోజులకు ఒకసారి డ్రిప్ ద్వారా అందించాడు. అదేవిధంగా 5 గ్రాముల సూక్ష్మ ధాతు మిశ్రమాన్ని ఒక లీటరు నీటికి కలిపి ప్రతి పదిహేను రోజులకు ఒకసారి పైపాటుగా పిచికారి చేశాడు.

మొక్క నాటిన 20 రోజుల తరువాత వచ్చిన పూ మొగ్గలను, తలలను తుంచి వేయించాడు. తద్వారా ఎక్కువ శాఖలు, కొమ్మలు ఏర్పడ్డాయి. ఇలా మంచి దిగుబడి సాధించాడు.

అంతకుముందు ఏరువాక శాస్త్రవేత్తలు ఈ పొలాన్ని సందర్శించి.. వారి పొలంలోనే పై ప్రక్రియలను చూపించారు. అదేవిధంగా ఎరువుల మోతాదును ఎలా వేయాల్సిందీ చెప్పారు..



| సాగు ఖర్చుల వివరాలు (అర ఎకరానికి) | |
|---|---|
| నేల తయారీ, బోదెల ఏర్పాటుకు | రూ. 4,200 |
| నారు మొక్కలు | రూ. 4,800 |
| పశువుల ఎరువు | రూ. 3,500 |
| నారు నాటు కూలి | రూ. 600 |
| పురుగులు, తెగుళ్ల నివారణకు | రూ. 1,000 |
| ఎరువులు | రూ. 6,500 |
| కోతలు | రూ. 2,200 |
| మార్కెట్‌కు రవాణా | రూ. 1,200 |
| **మొత్తం ఖర్చు** | **రూ. 24,000** |
| దిగుబడి | 1500 కిలోల పువ్వులు |
| స్థూల ఆదాయం | కిలో రూ. 65 చొప్పున రూ. 97,500 |
| **నికరాదాయం** | **రూ. 73,000 (లాభం)** |

# ఈసారైనా చుక్కల భూములకు పరిష్కారం లభిస్తుందా?

చుక్కల భూముల సమస్యతో తమ భూములను అమ్ముకోలేక ఏళ్ల తరబడి నరకయాతన అనుభవిస్తున్న రైతుల సమస్య ఎప్పటికి పరిష్కారం అవుతుందో తెలియడం లేదు. రాష్ట్ర సిసిఎల్ఏ కమిషర్ నాలుగు నెలల్లో ఈ సమస్యను పరిష్కరిస్తామని ప్రకటించినప్పటికీ గత అనేక ఏళ్లుగా ప్రభుత్వం ఇదే విధంగా చెపుతూ వస్తోంది. రెవెన్యూ శాఖ ప్రిన్సిపల్ సెక్రటరీగా ఉన్న కాలంలో ఉషారాణి ఈ విషయమై కొంత కృషి చేసినప్పటికీ సమస్య పరిష్కారం కాలేదు. సమస్య మాత్రం అలాగే ఉంది. అయితే ఇప్పుడు సిసిఎల్ఏ కమిషనరు సాయి ప్రసాద్ విజయవాడలో విలేకరులతో మాట్లాడుతూ.. రాష్ట్ర వ్యాప్తంగా చుక్కల భూముల సమస్య (డాటెడ్ ల్యాండ్స్)ను పరిష్కరించేందుకు ప్రభుత్వం కృషి చేస్తోందని పేర్కొన్నారు. ఇందుకు సంబందించి 26 జిల్లాల్లో ఇప్పటి వరకు లక్షా పదివేల దరఖాస్తులు రాగా, అందులో వివిధ కారణాలతో 59వేల దరఖాస్తులు తిరస్కరణకు గురయ్యాయన్నారు. తిరస్కరణకు గురైన దరఖాస్తులను తిరిగి పరిశీలించి సమస్యను పరిష్కరించాలని ఆయా జిల్లా కలెక్టర్లకు ఆదేశాలిచ్చినట్లు సిసిఎల్ఏ పేర్కొన్నారు. సమస్యను పరిష్కరించేందుకు 3 నుంచి నాలుగు నెలల సమయం పడుతుందన్నారు. సచివాలయంలోని పబ్లిసిటీ సెల్‌లో ఏప్రిల్ 19న సిసిఎల్ఏ కమిషనరు మీడియాతో మాట్లాడారు. చుక్కల భూముల సమస్యకు పరిష్కారం కనుక్కునేందుకు ప్రభుత్వం కొన్ని సూచనలు చేసిందన్నారు. 2017 నాటికి పట్టాదారు పాసు పుస్తకాలు పొంది ఉండి, అంతకు మునుపు 12 సంవత్సరాలుగా ఆర్ఓఆర్, అడంగల్‌లో భూ యజమాని, సాగుదారుని పేరు ఉంటే అటువంటి వారికి పాస్‌పుస్తకాలు ఇవ్వడం జరుగుతుందన్నారు. ఇందుకోసం ఫ్రేమ్ వర్క్ చేయాల్సి ఉందన్నారు. ఆటోమ్యుటేషన్ ప్రక్రియను ఎట్టిపరిస్థితుల్లోనూ రెండు నెలల్లో పూర్తి చేసే విధంగా చర్యలు చేపట్టనున్నట్లు తెలిపారు. భూముల అమ్మకాలు, కొనుగోలు 75శాతం



మేర జరిగాయని, ఫలితంగా రెవెన్యూ రికార్డుల్లో మార్పులు, చేర్పులు జరుగుతూనే వుంటాయన్నారు. రీ సర్వే ప్రారంభమైన గ్రామాల్లో మ్యుటేషన్‌కు ముందే సబ్ డివిజన్ తప్పనిసరి చేస్తున్నామన్నారు. ఇదే విధానం కర్నాటకలో అమల్లో ఉందన్నారు. ఆస్తుల రిజిస్ట్రేషన్‌కు ముందుగా రెవెన్యూ రికార్డులను వెరిఫై చేయాలని, రెండు రికార్డులు సరిపోయిన తర్వాత రిజిస్ట్రేషన్ ప్రక్రియ చేయాలని ఆదేశాలు ఇవ్వడం జరుగుతుందన్నారు. రెవెన్యూకు సంబంధించి ఎటువంటి ప్రక్రియ ముందుకు సాగాలన్నా లబ్దిదారులు గ్రామ సచివాలయంలో దరఖాస్తు చేసుకోవాలని, అనంతరం విఆర్ఓ, ఆర్ఐ లాగిన్‌కు దరఖాస్తులు అందుతాయన్నారు. మండల స్థాయిలో అధికారులు అభ్యంతరాలు పెడితే ఆయా దరకాస్తులు ఆర్డీఓకు పంపు తారన్నారు. 2023 నవంబరు నాటికి భూముల రీ సర్వే ప్రక్రియ పూర్తయ్యే విధంగా పనిచేస్తున్నా మన్నారు. ఇప్పటి వరకు 430 గ్రామాల్లో సర్వే ప్రక్రియ పూర్తయ్యిందని, ఆయా గ్రామాలకు సంబంధించిన రికార్డుల తయారీ ప్రక్రియ జరుగుతోందన్నారు. భూముల కొలతల్లో తేడాలొస్తే ఆయా భూముల యజమానులు రెండో విడత కొలతలు వేయాలని ఎవరైనా దరఖాస్తులు చేసుకుంటే అటువంటి వారి భూములు కొలతలు వేసే ముందు ఆయా సర్వే నెంబర్లలోని మిగిలిన భాగస్వాములకు కూడా ముందస్తుగా నోటీసులు ఇవ్వడం జరుగుతుందన్నారు.

# కష్టంతోనే విజయం




- పద్మావతి

**వ్యవసాయంలో నష్టం, కొడుకు అనారోగ్యం విజయను సేంద్రియ వ్యవసాయం వైపుకు మళ్లించాయి. చదువు, అనుభవం లేక ఎదురైన ప్రతి సవాళ్లను కష్టంతోనే ఎదుర్కొన్నారు. లాభం రాకపోయినా వెనకంజ వేయలేదు. మార్కెట్లో అమ్ముడుపోని వాటిని తన పంటకి ప్రత్యామ్నాయ మార్గం వెతుక్కున్నారు. అప్పుల్లో కూరుకుపోయిన కుటుంబాన్ని బయట పడేసి లాభాలు గడిస్తూ ఉత్తమ మహిళా రైతుగా నిలిచారు.**

గుంటూరు జిల్లా, గర్నెపూడికి చెందిన తూమాటి విజయ రైతు కుటుంబంలో పుట్టారు. ఆ ప్రాంతం మొత్తం మిర్చి, పత్తి పంటలు పండిస్తారు. ఏళ్ల తరబడి రసాయన ఎరువులు, పురుగు మందులు వాడటంతో భూమి సత్తువ, సారం తగ్గి, పంట దిగుబడి తగ్గింది. దాంతో భర్త వ్యసనాలకు బానిస అయ్యారు. పెద్ద కొడుకు అనారోగ్య సమస్య నిద్ర పట్టనివ్వలేదు. ఒక్కసారిగా కుటుంబం మొత్తం అప్పుల ఊబిలో కూరుకుపోయింది. ఇల్లు, పొలం తప్ప ఏమీ తెలియని విజయ తన సమస్యకు తానే పరిష్కారం వెతుక్కుంది. పొలాన్ని, కొడుకుని కాపాడుకుంది. ఆమె విజయం వెనక ఎంత కష్టం ఉందో తన మాటల్లో తెలుసుకుందాం.

## సేంద్రియంతో మిర్చి సాగు

'నేను ఐదో తరగతి చదివాను. పక్క ఊరికి పంపించడం ఇష్టం లేక మా వాళ్లు చదువు మాన్పించారు. ముగ్గురు ఆడపిల్లల్లో పెద్దదాన్ని కావడంతో చిన్న వయసులోనే పెళ్లి చేశారు. ఆయన ఇల్లు, పొలం తప్ప నాకు వేరే లోకం తెలియనివ్వలేదు. పక్కింటికి కూడా పంపించేవాడు కాదు. ఇద్దరు మగపిల్లలు పుట్టారు. వారితో నాకు సమయం తెలిసేది కాదు. రెండేళ్ల క్రితం నాలుగెకరాల పొలంలో మిర్చి, పత్తి వేశాం. పెట్టుబడి కూడా రాలేదు. ఇలా ఎందుకు జరిగిందో తెలుసుకునే లోపే నా భర్త వ్యసనాలకు బానిస అయ్యారు. అప్పులు ఎలా తీర్చాలో అర్థం కాలేదు. మూడేళ్ల క్రితమే పెద్దోడు భార్గవ్‌కి పేగుకు సంబంధించిన సమస్య వచ్చింది. ఏం తిన్నా అరిగేది కాదు. కడుపులో మంట, వాంతులు అయ్యేవి. వాడిని తీసుకుని రోజుల పాటు ఆసుపత్రులు తిరిగాను. డాక్టర్లు చాలా పరీక్షలు చేశారు. సమస్య ఎక్కడ ఉందో వారికి కూడా అర్థం అయ్యేది కాదు. మందులు ఎన్ని వాడినా సమస్య తీరలేదు. వాడికి ఏమవుతుందోనన్న భయం నాకు నిద్ర పట్టనివ్వలేదు. మరో పక్క పొలం కోసం చేసిన అప్పు సమస్య. పిల్లల్ని చదివించాలి, బాగా చూసుకోవాలని బలంగా ఉండేది. తిండిలో కల్తీ, ఆహారంలో బలం లేక ఈ అనారోగ్య సమస్యలు వస్తాయని తెలుసుకున్నాను. అందుకే నేను సేంద్రియ వ్యవసాయం చేయాలని నిర్ణయించుకున్నా. కానీ అందులో నాకు ఏ అనుభవం లేదు. ఎంత మందిని అడిగినా సరిగ్గా చెప్పేవారు కాదు. ఫోన్‌లో యూట్యూబ్ ద్వారా కొన్ని విషయాలు సేకరించాను. నష్టపోయినా పర్వాలేదు అని ధైర్యం చేసి సాగు చేశాను. చీడ పట్టింది. మందులు చల్లలేదు. మొదట నష్టపోయాను. అయినా సేంద్రియ వ్యవసాయం మానుకోలేదు. సేంద్రియ వ్యవసాయం సలహాదారులతో మాట్లాడాను. ఏ రైతు కూడా సేంద్రియ ఎరువులతో మిర్చి పండించలేదని వారు చెప్పారు. కానీ నేను సాగు చేయాలనుకున్నాను. ఆవు పంచకం, వేపాకు కషాయం, వేప గింజల కషాయం, సీతాఫలం గింజల కషాయం, మట్టి ద్రావణం, జీవామృతం, పది రకాల ఆకులతో తయారు చేసిన దశకర్ని కషాయాలతో పంటకు పట్టిన చీడపీడలను వదిలించాను. దాంతో ఎకరాకు నాలుగు క్వింటాళ్ల మిర్చి దిగుబడి వచ్చింది.

## కారప్పొడులు, పచ్చళ్లు

మార్కెట్లో సేంద్రియ మిర్చిని కొనే దళారులు లేరు. పంట ఎవరైనా కొంటారేమోనని చాలా ప్రయత్నాలు చేశాను. చాలా తక్కువ రేటుకు అడిగారు. దాంతో నాకు పంట ఎలా అమ్మాలో అర్థం కాలేదు. కారం

అందరికీ అవసరం. అందుకే మిరపకాయలను కారం పట్టించి అమ్మితే ఎలా ఉంటుందో అని ఆలోచన చేశాను. కానీ మామూలు కారం ఒక్కటే అమ్మితే నాకు పెట్టుబడి కూడా రాదు. అందుకే రకరకాల కారప్పొడులు పట్టించి అమ్ముతున్నా. కూర కారం, ఇడ్లీ కారం, మునగాకు, కరివేపాకు, పుదీనా, కొత్తిమీర, అవిసె గింజల కారం, పల్లీ కారం, కొబ్బరి కారం.. ఇలా రకరకాల కారాలు తయారు చేసి అమ్మాను. ఆరు నెలల నుంచి పచ్చళ్లు పడుతున్నా. కారప్పొడులు, పచ్చళ్లు అమ్మకానికి ఫేస్‌బుక్ అకౌంట్‌ని నా స్నేహితురాలు క్రియేట్ చేసి ఇచ్చింది. మొదట్లో ఎలా వాడాలో తెలిసేది కాదు. అన్నీ తెలుసుకున్నాను. ఫేస్‌బుక్ ద్వారానే ఎక్కువ ఆర్డర్లు వస్తున్నాయి. 'ఆడదానివి! సేంద్రియ వ్యవసాయం చేయడం ఏంటి? వ్యాపారం అవసరమా?' అని చాలామంది అన్నారు. హానిలేని, ఆరోగ్యంతో కూడిన పంట పండించాలనే నా లక్ష్యం ముందు ఆ మాటలు నిలబడలేదు.

### పిల్లలే తోడు

భర్త సహాయం లేని నాకు పిల్లలే తోడయ్యారు. వారే సైకిల్ నేర్పించారు. ఇంటి నుంచి పొలానికి వెళ్లాలన్నా, తిరిగి ఇంటికి వెళ్లడానికి, ఇతర పనులకు ఇబ్బంది కలగకుండా ఉండేందుకు నేను టివిఎస్ తీసుకున్నాను. అదీ పిల్లలే నేర్పించారు. మిరపకాయలను కారం పట్టించడానికీ, కారప్పొడులను కొరియర్ చేయడం కోసం టు వీలర్ మీదే వెళ్తొస్తూ ఉంటాను. చదువుకుంటూనే, కారప్పొడుల తయారీలో మా పిల్లలు చాలా సహాయం చేస్తున్నారు. రాత్రిళ్లు పొలానికి నీళ్లు పెట్టేందుకు పిల్లల్ని వెంటబెట్టుకుని వెళ్లేదాన్ని. అన్ని విషయాలు వారితో మాట్లాడతాను. వారు కూడా నాతో స్నేహంగా ఉంటారు. పెద్దోడు భార్గవ్ అనారోగ్యం కారణంగా రెండేళ్లు ఇంటి దగ్గర వున్నాడు. ఆయుర్వేద మందులు వాడిన తర్వాత కొంచెం కోలుకున్నాడు. ఇప్పుడు





బీఎస్సీ బయో టెక్నాలజీ సెకండ్ ఇయర్ చదువుతున్నాడు. చిన్నోడు పదో తరగతి చదువుతున్నాడు. వారికి కూడా సేంద్రియ వ్యవసాయం మీద ఆసక్తి ఉంది. భవిష్యత్తులో ఏ ఉద్యోగం చేస్తున్నా వ్యవసాయం వదులుకోరు.

### విజ్ఞానం దిశగా అడుగులు

చదువు అంటే ఇష్టం ఉన్న నాకు ఏ పేపర్ కనిపించినా చదువుతూ ఉండేదాన్ని. నాకు సమస్యలు ఎదురైనప్పుడు ఏమి చెయ్యాలో తెలిసేది కాదు. అప్పుడు పేపర్లో వచ్చిన కొన్ని సంఘటనలు, విషయాలు నాకు పరిష్కారం చూపాయి. అలా తిరిగి చదవడం మొదలు పెట్టాను. ఫేస్‌బుక్ ద్వారా పరిచయం అయిన మహిళా మిత్రుల ద్వారా నేను పుస్తకాలు చదువుతున్నాను. సమాజంలో ఆడవాళ్ల పట్ల చిన్నచూపు, వేధింపులు, హింస ఎలా ఉంటుందో, వాటిని ఎలా ఎదుర్కోవాలో తెలుసుకున్నాను. ఆ జ్ఞానంతోనే నా సమస్యలను పరిష్కార కోణంలో ఆలోచన చేస్తున్నాను. ఆరోగ్యానికి సంబంధించి చాలా పుస్తకాలు కొన్నాను. ఇప్పుడు దేని గురించైనా స్పష్టంగా రాయగలుగుతున్నా, చెప్పగలుకుతున్నాను."

## గుంటూరు ఛానల్‌కోసం తక్షణం భూ సేకరణ జరపాలి

పెదనందిపాడు, ప్రతిపాడు, పర్చూరు ప్రాంత ప్రజల చిరకాల వాంఛ అయిన గుంటూరు ఛానల్‌కు భూ సేకరణ జరపాలని ఎపి రైతు సంఘం పెదనందిపాడు మండల మహాసభ తీర్మానించింది. మహాసభలో ఎపి రైతు సంఘం ఉపాధ్యక్షులు వి.కృష్ణయ్య మాట్లాడుతూ.. ఈ ప్రాంతం రైతాంగం గుంటూరు ఛానల్ కోసం సుదీర్ఘకాలంగా ఉద్యమించిన ఫలితంగానే నేడు భూ సేకరణకు సర్వే నిర్వహించే పరిస్థితి ఏర్పడిందని అన్నారు. ప్రభుత్వం భూ సేకరణకు రూ.100 కోట్లు కేటాయించినందున కాలహరణం చేయకుండా పనులు ప్రారంభించాలని ఆయన ప్రభుత్వానికి సూచించారు. ఈ ప్రాంతంలో మిర్చి రైతులు ప్రభుత్వ తప్పుడు వైఖరి కారణంగా తీవ్రంగా నష్టపోయారని అన్నారు. రాష్ట్ర ప్రభుత్వం బీమా కంపెనీ ఏర్పాటు చేస్తానని చెప్పి దాని ఊసే మరిచిందన్నారు. కేంద్ర ప్రభుత్వ బీమా పథకం, ఆఖరికి ప్రయివేటు బీమా పథకాలు కూడా రైతులను ఆదుకోలేకపోయాయని ఆవేదన వ్యక్తం చేశారు. మహాసభలో రైతు సంఘం మండల అధ్యక్ష, కార్యదర్శులుగా ముద్దన వెంకటేశ్వర్లు, శివరామ్‌లను ఎన్నుకున్నారు. రైతు నాయకులు నాగేశ్వరరావు కూడా పాల్గొన్నారు.

### కొమ్మూరు కాలువ పరిశీలన

గత నవంబరులో కురిసిన భారీ వర్షాలు, వరదల కారణంగా రైతులకు తీవ్ర నష్టాలను మిగిల్చిన కొమ్మూరు కాలువను రైతు సంఘ నేతలు పరిశీలించారు. ఈ ఛానల్ కింద సాగు చేసిన పొలాలు మునిగిపోయి పంటలు నాశనమయ్యాయి. భారీగా నష్టం జరిగినా 25 శాతమే నష్టం పరిహారంగా ఎకరానికి ఆరు వేల రూపాయలు మాత్రమే ఇచ్చింది. భవిష్యత్తులో వర్షాలు, వరదల వల్ల ఇబ్బందులు ఏర్పడకుండా కొమ్మూరు కాలువను ఛానలైజ్ చేయాలని రైతు సంఘ నాయకులు కోరారు.




### వ్యవసాయానికి 9 గంటల విద్యుత్తు కొనసాగించాలి

వ్యవసాయానికి విద్యుత్తును నిర్విరామంగా 9 గంటలపాటు కొనసాగించాలని విజయవాడ గుణదలలోని విద్యుత్తు సౌధ వద్ద ఎపి రైతు సంఘం ఆధ్వర్యంలో ధర్నా నిర్వహించారు. ఎపి రైతు సంఘం కృష్ణాజిల్లా కమిటీ ఆధ్వర్యంలో ఈ కార్యక్రమం కొనసాగింది. ఈ సందర్భంగా ఎపి రైతు సంఘం రాష్ట్ర అధ్యక్షులు వై.కేశవరావు, ప్రధాన కార్యదర్శి మర్రాపు సూర్యనారాయణ మాట్లాడుతూ.. రాష్ట్రంలో అప్రకటిత విద్యుత్తు కోతలతో గ్రామీణ ప్రాంత రైతులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారని అన్నారు. పంటలు చేతికొచ్చే సమయంలో విద్యుత్ కోతల వల్ల రైతులు అయోమయంలో పడిపోయారని, విద్యుత్తు ఎప్పుడు వచ్చి ఎప్పుడు పోతుందో తెలియక పొలాల వద్దనే రైతులు రేయింబవళ్లు కాపలా కాస్తున్నారని వివరించారు. రైతు సంఘం ఎన్‌టిఆర్ జిల్లా కార్యదర్శి పి.వి.ఆంజనేయులు మాట్లాడుతూ.. రాష్ట్రప్రభుత్వం తక్షణమే విద్యుత్తు కోతలను ఎత్తివేయాలని డిమాండ్ చేశారు. ఇంకా రైతు సంఘం కృష్ణాజిల్లా కార్యదర్శి హరిబాబు, ఎన్‌టిఆర్ జిల్లా రైతు సంఘం ఉపాధ్యక్షులు నిమ్మగడ్డ నరసింహ పాల్గొన్నారు.

### ధాన్యం కొనుగోలు చేయాలని బస్తాలతో ధర్నా

రైతుల వద్ద ఉన్న చివరి వరి గింజను సైతం ప్రభుత్వమే కొనుగోలు చేయాలని కోరుతూ ఎపి రైతు సంఘం ఆధ్వర్యంలో పల్నాడు జిల్లా కొండ్రముట్ల గ్రామంలో వినుకొండ- కారంపూడి రహదారిపై ధాన్యపు బస్తాలతో ఆందోళన నిర్వహించారు. ఈ సందర్భంగా రైతు సంఘం పల్నాడు జిల్లా కార్యదర్శి ఏపూరి గోపాలరావు మాట్లాడుతూ.. ఆర్‌బికెల ద్వారా ప్రభుత్వం కొంతమంది రైతుల వద్దనే ధాన్యం కొనుగోలు చేసిందన్నారు. కొండ్రముట్లలో 345 మంది వద్ద ధాన్యం కొనుగోలు చేసి 54 మంది రైతులకు మూడు నెలలు గడుస్తున్నా బకాయిలు చెల్లించలేదని అన్నారు. ఈ సురేష్‌రాజా, బి.వెంకటేశ్వర్లు, మారుతి వరప్రసాద్, యు. రాము, రాజారావు, తిరుమల లక్ష్మి తదితర నాయకులు పాల్గొన్నారు.

### సుగర్స్ బకాయిలు తక్షణం చెల్లించాలని వినతి

అనకాపల్లి జిల్లాలోని గోవాడ, ఏటికొప్పాక, తాండవ, తుమ్మపాల సహకార చక్కెర కర్మాగారాలను ఆధునీకరించాలని, రైతుల బకాయిలు రూ.28 కోట్లు, కార్మికుల బకాయిలు రూ.20 కోట్లు తక్షణమే చెల్లించాలని జిల్లా జాయింట్ కలెక్టర్‌ను కలిసి ఎపి రైతు సంఘం ప్రతినిధివర్గం కోరింది. ఈ కార్యక్రమంలో రైతు సంఘం జిల్లా కార్యదర్శి ఎ. అప్పారావు, నాయకులు పరదేశినాయుడు, తేలయ్యబాబు, రామసదాశివరావు తదితరులు పాల్గొన్నారు.

### నాసిరకం విత్తనాలతో నష్టపోయిన రైతులను ఆదుకోవాలి

నకిలీ నాసిరకం విత్తనాలు సాగు చేసి నష్టపోయిన పల్నాడు జిల్లా మాచవరం మండలం పిన్నెల్లికి చెందిన రైతులకు ఎకరానికి రూ.లక్ష చొప్పున ఇచ్చి ఆదుకోవాలని రైతు సంఘం పల్నాడు జిల్లా కార్యదర్శి ఏపూరి గోపాలరావు డిమాండ్ చేశారు. ప్రైవేటు వడ్డీ వ్యాపారుల వద్ద అప్పులు తెచ్చి సాగు చేస్తే రైతుల కష్టం నకిలీ విత్తనాలతో దెబ్బతినిపోయిందని విమర్శించారు. నకిలీ విత్తనాల కంపెనీ యజమానులపైనా, డీలర్లపైనా చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేశారు.

### శింగనమలలో విద్యుత్తు సబ్ స్టేషన్ వద్ద ధర్నా

అనంతపురం జిల్లాలో విద్యుత్తు కోతలకు నిరసనగా శింగనమల విద్యుత్తు ఉప కేంద్రం వద్ద రైతులు ధర్నా నిర్వహించారు. అంతేగాక పుట్లూరు మండలంలో రాస్తారోకో కూడా నిర్వహించారు. ఈ కార్యక్రమానికి రైతులు పెద్దఎత్తున తరలివచ్చారు. విద్యుత్తు కోతల వల్ల మోటార్లు ఆడక పంటలు ఎండిపోతున్నాయని రైతులు నిరసనలు వ్యక్తం చేశారు.

### పలుచోట్ల రైతు సంఘ వ్యవస్థాపక దినోత్సవాలు

రైతు సంఘ వ్యవస్థాపక దినోత్సవాన్ని పురస్కరించుకొని ఏప్రిల్ 11వ తేదీన రాష్ట్రంలో పలుచోట్ల ఎఐకెఎస్ పతాకాలను ఆవిష్కరించారు. అనంతపురం జిల్లా బుక్కరాయ సముద్రం, అనకాపల్లి జిల్లా అచ్యుతాపురం మండలం తిమ్మరాజు పేట జంక్షన్, పల్నాడు జిల్లా దాచేపల్లి మండలం పెదగార్లపాడు గ్రామంలో రైతు సంఘం జెండాలను ఆవిష్కరించారు. నంద్యాల జిల్లా చాబోలు కానాల, ఇంకా కొత్తపల్లి మండలం సింగరాజుపల్లి, పాములపాడు, నందికొట్కూరు మండలం కొడిదెల, కురుకుంద గ్రామాల్లో జెండాలను ఆవిష్కరించారు. నంద్యాల జిల్లాలో తొమ్మిది మండలాల్లో 25 సెంటర్లలో పతాకావిష్కరణలు జరిగాయి. వీటిలో 582 మంది రైతులు పాల్గొన్నారు. ఇంకా వెలుగోడు మండలం కందాల, అనంతపురం

జిల్లా శింగనమలలోనూ ఆవిష్కరించారు. అలాగే బిల్లాపురంలో రైతు సంఘం పతాకాన్ని రైతు సంఘ రాష్ట్ర ఉపాధ్యక్షులు టి.రమేష్‌కుమార్ ఆవిష్కరించారు. ఆత్మకూరు మండలం కొత్త రామాపురం గ్రామంలో కూడా పతాకాలను ఆవిష్కరించారు.

### అంకూరు కంపెనీ నాసిరకం విత్తనాలతో రైతులకు నష్టం

అంకూరు కంపెనీకి చెందిన వరి విత్తనాలతో సాగు చేసిన రైతులు తీవ్రంగా నష్టపోయారని, బాధితులకు ఎకరానికి రూ.50 వేల చొప్పున నష్ట పరిహారం అందించాలని ఎపి రైతు సంఘం పల్నాడు జిల్లా ప్రధాన కార్యదర్శి ఏపూరి గోపాలరావు ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. కారంపూడి మండలం లక్ష్మీపురం గ్రామానికి చెందిన రైతులు ఇలా నష్టపోయారని, వారు వెళ్లి విత్తనాలు అంటగట్టిన డీలర్‌ను సంప్రదించగా, కంపెనీ నష్టపరిహారం చెల్లిస్తుందని చెప్పారు. అయితే ఎన్ని రోజులైనా పరిహారం రైతులకు అందలేదు. నకిలీ విత్తనాలు అమ్మిన కంపెనీ యాజమాన్యంపైనా, డీలరుపైనా చర్యలు తీసుకోవాలని, నష్టపోయిన రైతులను ఆదుకోవాలని ఆయన డిమాండ్ చేశారు.

### తెగుళ్లతో నష్టపోయిన వరి రైతులను ఆదుకోవాలి

ఎండాకు తెగులుతో వరి పంట దెబ్బతిని నష్టపోయిన రైతులకు, కౌలు రైతులకు నష్టపరిహారం ఇచ్చి ఆదుకోవాలని ఎపి రైతు సంఘం ఏలూరు జిల్లా కార్యదర్శి కె.శ్రీనివాస్ కోరారు. జిల్లాలోని ఉంగుటూరు మండలం కైకరం ఆయకట్టు పరిధిలో ఎండాకు తెలుగుతో వరి పంటకు జరిగిన నష్టాన్ని ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం నాయకులు పరిశీలించారు. నష్టపోయిన రైతులను ఆదుకోవాలని నినాదాలు చేస్తూ పంట పొలాల వద్ద ఆందోళన నిర్వహించారు. శ్రీనివాస్ మాట్లాడుతూ.. ఎకరానికి పెట్టుబడిగా సుమారు 25 వేల రూపాయల వరకూ పెట్టారని అన్నారు. సార్వా సమయంలో అధిక వర్షాలు, వరదల వల్ల పంట నష్టపోయారని, దాళ్వాలో తెగులు సోకి దిగుబడి రాక నష్టపోయారని తెలిపారు. ఈ కార్యక్రమంలో నాయకులు కొర్ని అప్పారావు, కట్టా భాస్కరరావు, సనపల అప్పన్న, అద్దేపల్లి బాబూరావు, సిహెచ్ వెంకటేశ్వరరావు, వాసు, కొండలు, గోవిందు తదితరులు పాల్గొన్నారు.

### కంపెనీ అనుచిత నిబంధనలతో పామాయిల్ రైతులకు నష్టం

కంపెనీ పెట్టిన నిబంధనల వల్ల పామాయిల్ రైతులకు తీరని నష్టం జరుగుతోందని కనుక నిబంధనలు ఎత్తివేయాలని ఏలూరు జిల్లా చింతలపూడి మండలం ప్రగడవరం గ్రామంలో గోద్రెజ్ కంపెనీ వేబ్రిడ్జి వద్ద ధర్నా నిర్వహించారు. రైతు సంఘం మండల అధ్యక్షులు చంద్రశేఖరరెడ్డి మాట్లాడుతూ.. వేబ్రిడ్జి కాటా దగ్గరకు కేటాయించిన టెంకి పామాయిల్ గెలలు రాకపోతే వాటిని తీసుకోవడం లేదని, రైతులను తీవ్రంగా ఇబ్బందులు పెడుతున్నారని అన్నారు. ఆ కార్యక్రమంలో ప్రగడవరం చుట్టుపక్కల పామాయిల్ రైతులు పాల్గొని వారి కష్టాలను తెలియజేశారు.

### తాండవ, ఏటికొప్పాక షుగర్స్ బకాయిల చెల్లింపునకు జెసి హామీ

అనకాపల్లి జిల్లాలోని తాండవ, ఏటికొప్పాక సహకార షుగర్ ఫ్యాక్టరీలకు గత క్రషింగ్ సీజనులో చెరకు సరఫరా చేసిన రైతులకు బకాయి పేమెంట్లు, కార్మికులకు బకాయి వేతనాలుకు సంబంధించి జిల్లా జాయింట్ కలెక్టర్ గారి సమక్షంలో జిల్లా కలెక్టర్ గారి కార్యాలయంలో చర్చలు జరిగాయి. ఈ సందర్భంగా జిల్లా జాయింట్ కలెక్టరు మాట్లాడుతూ.. నెల రోజుల్లోపుగా బకాయిలు చెల్లించేలా చర్యలు తీసుకుంటామని రైతు సంఘ ప్రతినిధులకు హామీ ఇచ్చారు.

### ఉపాధి కార్మికుల ధర్నాకు రైతు సంఘం మద్దతు

ఉపాధి హామీ కూలీల సమస్యలు పరిష్కరించాలని కోరుతూ ఉపాధి హామీ కూలీలు విఆర్ పురం మండలంలోని రామవరంపాడు, కారంగుండ రామవరంలో చేస్తున్న ఆందోళనకు రైతు సంఘం పక్షాన ఎపి రైతు సంఘం అధ్యక్ష కార్యదర్శులు కుంజా నాగిరెడ్డి, వడ్లది రమేషులు మద్దతు పలికారు. వీరు వారు పని చేస్తున్న ప్రదేశాలకు వెళ్లి పనులను పరిశీలించారు. వారు చేసే ఆందోళనలో న్యాయం ఉడటంతో మద్దతు పలికి ఉపాధి కూలీల సమస్యలను పరిష్కరించాలని కోరారు.

### చెరకు రైతుల బకాయిలు చెల్లించాలని కలెక్టరుకు వినతి

తిరుపతి జిల్లాలోని చక్కెర పరిశ్రమ యజమానులు చెల్లించాల్సిన బకాయిలను తక్షణమే ఇవ్వాలని కోరుతూ రైతుసంఘం, సిఐటియుల ఆధ్వర్యంలో జిల్లా కలెక్టరుకు వినతిపత్రం సమర్పించారు. వినపత్రాలను రైతు సంఘం జిల్లా ప్రధాన కార్యదర్శి దాసరి జనార్థన్, సిఐటియు జిల్లా ప్రధాన కార్యదర్శి కందారపు మురళిలు కలెక్టరును కలిసి షుగర్స్ రైతుల, కార్మికుల ఇబ్బందుల గురించి తెలియజేశారు. మూడేళ్లుగా రైతులకు చెల్లించాల్సిన బకాయిలు 80 కోట్ల రూపాయలు పెండింగులో ఉన్నాయని తెలిపారు. బకాయిలు చెల్లింపు జరగక రైతులు అప్పులు చేసి బతుకులీడ్వాల్సి వస్తోందన్నారు. ఆర్‌ఆర్ యాక్టు అమలు చేసి షుగర్ పరిశ్రమ ఆస్తులను వేలం వేసి రైతులకు చెల్లించాలని వారు కలెక్టరుకు విజ్ఞప్తి చేశారు. కలెక్టరు మాట్లాడుతూ.. చిత్తూరు నుంచి ఫైళ్లను తెప్పించి పరిష్కారం చేస్తానని హామీ ఇచ్చారు. *

# కరెంటు షాక్‌కు ఇవ్వాలి దిమ్మదిరిగే షాక్



- బొంతు దశరథ
సెల్ : 70 13 21 33 57

పల్లవి :

ఇంటింటికి కొట్టింది కరెంటు షాక్
పాలకులకు ఇవ్వాలి దిమ్మదిరిగే షాక్

చరణం : 1

విద్యుత్తు కొనుగోలు పంపకాల మధ్య తేడ
ట్రూ ఆఫ్ చార్జీ భలే అందమైన పేరు చూడ
ఏళ్లనాటి ఖర్చంత జనం మీద మోపుచుండ
బిల్లు చూసి నివ్వెరపోతే ఏం లాభం కదలకుండ

చరణం : 2

మోసేవాడి భారం చూసే వాడికేం తెలుసు
బానిసలా భరిస్తుంటే అవుతారు అలుసు
పెరిగే ధరలకు హద్దేలేదు ఏలేవాడికి బుద్ధే లేదు
ముప్పదేళ్ల నినాదం మళ్లీ వచ్చే చూడు నేడు

చరణం : 3

పెట్రోలు పెరిగినా దిన సరుకులు పెరిగినా
గ్యాసు బండ పెరిగినా విద్యుత్ పెరిగినా
శ్రమజీవుల ఆదాయం ఎవడిదైనా పెరిగెనా
కార్పొరేట్ల ఆదాయం ఏ కొంచెమైన తరిగెనా

చరణం : 4

ఎవరి కోసం ఉంది ఈ దగాకోర్ల ప్రభుత్వం
ప్రజల మూల్గులు పీల్చే ధనికవర్గ చుట్టం
ఎవరికి వారం కాదు ఒకరికి ఒకరం అందాం
ప్రజల మీద భారమేస్తే భరతం పడతామందాం

# శ్రమవాక్యం

- పద్మావతి రాంభక్త
99663 07777



తాజా ఉదయాలను దోసిళ్ళతో
బొట్టుబొట్టుగా తాగుతూ
ప్రతిదినం మొదలవుతుంది

అప్పుడే పిట్టలు
రెక్కలు విదిలిస్తూ పైకెగసి
ఆకాశాన్ని పాటలతో పలకరిస్తాయి
నగరం నిద్ర దుప్పటిలోంచి
ముఖం బైటపెట్టి
కాళ్ళను కూడదీసుకుంటూ ఉంటుంది
శ్రమదేహాలు పనిలోకి అడుగు మోపుతాయి

మధ్యాహ్నపు వేడిసెగలను ఊదుకుంటూ
ఆలోచనలను పొదుగుతూ
అస్తవ్యస్తమైన గదులకు క్రమశిక్షణ నేర్పుతాను
నగరం అప్పటికి నడకలోంచి పరుగుల్లోకి
పయనమైపోతుంది
పని లోతుల్లోకి పయనించిన దేహాలు
స్వేదాన్ని వర్షిస్తుంటాయి

సాయంకాలపు పల్చని నీడలను
పరికించి చూస్తూ
వాకిలికి చూపులను తోరణాలను చేస్తాను
నగరంతో పాటు దేహాలు కాళ్ళీడ్చుకుంటూ
వెనుకకు మరలుతుంటాయి
పిట్టలు గూట్లో మౌనాన్ని హత్తుకుంటాయి

చీకటిని తరిమేస్తూ దీపాల వెలుగులు
దేదీప్యమానంగా నవ్వుతుంటాయి
నక్షత్రాలు మెట్లెక్కుతూ
చందమామతో చేతులు కలుపుతాయి
అలసి ముదుచుకున్న దేహాల వెన్ను నిమురుతూ
రాత్రి నిశ్శబ్దంగా ఒళ్ళు విరుచుకుంటుంది
నలిగి కమిలిన దేహాలు
కునుకులోయలోకి జారతాయి.

కాలం చేతిలో కరిగిన క్షణాలను
బేరీజు వేసుకుని
లోపలి కాంతిని తోడుకుంటూ
ఊహలను పద్ధతిగా పేర్చడంలో నిమగమవుతాను

నగరం కనురెప్పలకు జోలపాడుతున్నపుడు
హృదయపుకొలనులో చిగురులు తొడుకుతూ
తలెత్తిన శ్రమవాక్యం
పురిటికందై ఒడిని నింపుతుంది!

# ఒక ఎండా కాలపు దాహం

- గవిడి శ్రీనివాస్
7019278368,
9966550601



ఈ వేసవి కాలం
దోసిళ్ళ లోంచి క్షణాల్ని ఒంపుకుంటూ
గొంతులోని తడిని ఎగరేసుకుపోతూ
ఎండను రాల్చుకుంటుంది

ఇంటిలోంచి కళ్ళు బయట ఆరేస్తే చాలు
పిల్లలు మూగిన ఐస్ క్రీం బండి
బాధ్యత రెక్కల్ని విప్పుతుంది
కన్నీటి దు:ఖాల్ని
లోలోపల ఆరేసుకుంటుంది .
ఇంటి లోపల ఉతికిన వస్త్రాల్ని చూస్తే చాలు
బయట ఎండలో
వయసు భారాన్ని లెక్కచేయని
ఇస్త్రిరి పెట్టి ముసలివాడు
బొగ్గుల నిప్పుల్లోంచి జీవితాన్ని చూపిస్తాడు
ఎండ పేలిపోతున్నా బండి కదలదు
శ్వాస ఆగిపోతున్నా
బతుకు పోరాటం ఆగదు

చూపులు తిప్పుకుని
నీటి టబ్బు వైపు చూస్తే చాలు
గడపలో నీటి కోసం కాకులు ఊగుతుంటాయి.
నీట మునుగుతుంటాయి
ఒక ఎండాకాలం నీటి స్పర్శ కోసం
గొంతులు మధన పడుతుంటాయి

నా చుట్టూ ఎండను తీసి గొడుగులా కాసి
ఒక్కో గొంతులో నీటినిపోసి
స్వచ్ఛంగా స్వేచ్ఛగా
పక్షిలా బతకాలనుంటుంది

ఒక ఎండాకాలపు దాహం
మనిషిని కాల్చుకుంటే ఎంత బావుణ్ణు
చినుకునై కురిస్తే ఇంకెంత బావుణ్ణు

Printed & Published by B. Tulasi Das on behalf of A.P. Rytusangam, 3/4B, Bypass Road, Vaddeswaram, Tadepalli, Guntur Dt, A.P.
At Prajasakti Daily Printing Press, Krishna nagar, Tadepalli (M), Guntur (Dt.,) Editor : P. NarasimhaRao

With Best compliments from..

# Some journeys have a solid beginning.

## Bhashyam Congratulates its Successful alumnus in Civil Services



P. Sahitya

**AIR 24**

K. Manoj Kumar

**AIR 157**





D. Satya Venkata Ashok

**AIR 350**




bhashyamschools.com



BHASHYAM®

Book Post - Printed Matter

MANARYTUVANI R.N.I. 52715/90





3/4B, Vaddeswaram Bypass , Vaddeswaram (Post), Tadepalli (Mandal), Guntur Dt, A.P.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M240 |
| పుస్తకం పేరు | రైతువాణి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Madhu |
| పేజీలు విడదీసినది | Madhu |
| స్కాన్ చేసినది | Navya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |